క॥ నాకును నిట్టులె నీకృప, నా కల్యాణాద్రిచాపుఁ ♦ డా భగవంతుం
డా కైలాసనివాసుం, డా కారుణికుండు కనుల ♦ కగుపట్టునొకో! 31

క॥ అనిన విని మౌని యనియెను, వనజేక్షణ! సందియంబు ♦ వల దిఁక సచిరం
బున నే యాఱవమాసం, బునఁ జూడఁగఁగలవు శివుని ♦ భూతశరణ్యున్. 32

గీ॥ ఆ శివునిచేత మఱి తదీ♦యార్ధమూర్తి
యైన జగదంబచేతఁ బ♦డాయు వరము
లొంచఁగల విది నిజము ము♦కుంద! సర్వ
కాలవృత్తములఁ గాంచు ము♦క్కంటికృపను. 33

క॥ పెక్కులకు వరములిచ్చిన, యక్కాత్యాయనీకాంతురంగుఁ ♦ డనఘుఁడు నీకుం
బెక్కుతన సుప్రసాదము, నక్కజముగఁ జేయకుండు? ♦ నంబుజనేత్రా! 34

క॥ దేవతలును నిను మెచ్చెద, రీవును బ్రహ్మణ్యుఁడవు స♦దేవ్యుఁడవు మహా! రా
జీవవిలోచన! జప్యము, నే వేగన్ జెప్పుదు శివుఁ గ♦నెడు వ్రతాన్. 35

గీ॥ అనినఁ దామరసాక్షుండు ♦ హాయి నొంది, యనియె మునీంద్ర! నీవు ది♦వ్యప్రసాద
మునదనుజసూదనునిఁ గ్రతు♦భుగ్విభునిఁగ, నియుదనాంగఁగుము సద్విద్య♦నీవు మయను.

— * ఉపమన్యుడు శ్రీకృష్ణునకు శైవదీక్ష నిచ్చుట * —

వ. ఇట్లు మహాదేవాశ్రితకథలతో నేఁడుదినంబులు మునిముఖ్యులతోఁ గడపి యెనిమిదవదినంబున నుపమన్యుండు శ్రీకృష్ణుని యథావిధి గంగాస్నానంబుఁ జేయించి దండకమండలకుశమేఖలాచర్మవసనంబు లొసంగి పాశుపతదీక్షనిచ్చి బ్రహ్మవిద్య నుపదేశించె ననంతరంబున నమ్మాధవుండు తపంబునకు నియుక్తుఁడై మాసమునందాక ఫలాహారంబునఁ గడపి రెండవనెలనుండి సలిలాశనం బొనరించుచు నేకపాదం బున నిలిచి యూర్ధ్వబాహుండై నిశ్చలవ్రతుండై తపించుచుండ ఐదునెలలుగడచి యాఱవనెల జరుగుచున్నంత నొక్కనాఁడు.

గీ। ఆకసమునందు సూర్యస♦హస్రతేజ, మగుపడియె నమ్మహామధ్య♦మందు మెఱపు
దీవియంబోలు కిటికిలఁ ♦ దీర్చియుండ, శక్రచాపకృతాంతము♦ శైలమొప్పఁడు.

— * శ్రీకృష్ణతపంబు మెచ్చి పార్వతీపరమేశ్వరులు సాక్షాత్కరించుట * —

క॥ అందుఁదపంబునఁ గాంతుల, సుందరతేజమున నలరు ♦ సుదతీమణితోఁ
జందురుని రేకతో డివి, యందు నినుండట్టులుండ ♦ నభవుండు రహిన్. 39

గీ॥ అంతఁ గంసాంతకుఁడు రోమ♦హర్ష మెసగ, నక్కజమ్ముగఁ గనుఁడమ్ము♦లలరఁగ నిటు
జమిలిపాముల జన్నిదం♦బమరువాని, నఖిలదైవతసంఘమూర్తి ♦ హరుని హరుని. 40

సీ॥ గద త్రిశూలం బజ♦గవము వజ్రంబు హ, స్తములందు నెంతేని ♦ దళుకు లీన
నెలబాలుఁ జొప్పొందు ♦ లలితకిరీటంబు, నిగనిగలందంబు ♦ నీటుసూప
మొలపయిన్ గట్టిన ♦ పులిచర్మ మెంతయుఁ, గర్బురదీధితుల్ ♦ గ్రమ్ముకొనఁగ
నురమున నొప్పొందు♦చున్న పసిండి త, మ్ములదండ చీలమం♦డలకుఁ దాఁక

గీ॥ సంజప్రొద్దున శారద ♦ సమయమందు, మేల్మిపరివేషమందున ♦ మెఱయుచంద్రుఁ
డట్లు విలసిల్లు నఖిలాబ్జ ♦ జాండవిభుని, శంకరునిఁ గనుఁగొనియెను ♦ జక్రధరుఁడు.

క॥ ప్రమథగణంబులతోఁ గడుఁ, గొమరొప్పఁగఁ జుట్టఁబడిన ♦ గోధ్వజుఁడొప్పెన్
రమణీయగిరిత్పగపై, మమున నలుపు ప్రొద్దువలె న♦శక్యుఁడయి కనన్. 42

వ. మఱియు నప్పరమశివుని

క॥ ఏకాదశరుద్రులు, శ్రీకరు లుడురాజశకల ♦ శేఖరులు ఘన
శ్లోకులు పరమంత్రంబుల, శ్రీకంఠు నుతించుచుండి ♦ రి కరము పేర్మిన్. 43

క॥ ఆదిత్యులు వసువులు వి, శ్వేదేవులు నాశ్వినులును ♦ సిద్ధులు సాధ్యుల్
మోదంబలరఁగ శర్వు మ, హాదేవు నుతించుచుండి ♦ రందుఁ గడువడిన్. 44

గీ॥ శతమఖుండును విష్ణుగడు♦శతధృతియు ని, తరులు గీర్వాణులును రథం♦తరముసామ
మును మహేశ్వరసాన్నిధ్య♦మునఁ బఠించు, చుండిరెంతయు నుల్లాస♦మొప్పమీఱ.

వ. మఱియు నంతను యోగీశ్వరులు బ్రహ్మర్షులు దేవర్షులు భూమ్యాకాశములు ఋక్షములు గ్రహములు నెలలు పక్షములు ఋతువులు నహోరాత్రులు సంవత్సరములు క్షణములు ముహూర్తములు యుగములు విద్యలితిహాసములు సనత్కుమారుఁడు మరీచి యంగిరుఁడు నత్రి యగస్త్యుఁడు పులస్త్యుండు పులహుఁడు క్రతువును మనువులు దక్షుఁడు భృగుఁడు వశిష్ఠుఁడు వేదములు జన్నంబులు దక్షిణలు త్రేతాగ్నులు హవిస్సును మూర్తిమంతంబులగు యజ్ఞద్రవ్యంబు లనంతాది నాగరాజులును గంగాది పుణ్యనదులును సాగరంబులును దేవతలును దేవపత్నులును దేవకన్యలును దశదిక్కులును మునిసహస్రంబులు పరమేశ్వరుని నమస్కరించుచుఁ గొలుచుచుండిరంతను గీతవాదిత్రకోవిదులగుగంధర్వులు నచ్చరలు నాటపాట లొనర్చుచుండిరంతను విద్యాధరులు జక్కులు దయ్యములు మున్నగునవి కొండలు మ్రాకులు మనోవాక్కరణంబుల మహాదేవు నుపాసించుచుండె నిట్లు కట్టెదుటఁ బరమేశానుండు పొడసూపి వాసుదేవునిఁ జగంబును గాంచుచున్నంత హరి యమ్మహాదేవునిఁ గన్గొనఁజాలకుండుటయు నమ్మహేశ్వరుండెఱిఁగి యతని కిట్లనియె. 46

క॥ పలుమఱు నీచేతను బూ, జలఁ గొనుచుంటిని హరీ! ప్ర♦శస్తచరిత! యి
మ్ముల నినుబోలెడు నిష్టుఁడు, గలుగఁడు నాకీ జగతి నొ♦కండేనియునున్. 47

## —* శ్రీకృష్ణుఁడు శివుని స్తుతించుట *—

గీ॥ అనిన విని యాతఁ డిట్లనె♦నమ్మహాత్మ్మ, నకు నమస్కార మిద్ది యు♦నారతంపుఁ
బుణ్యకారణునకు బ్రహ్మ♦మును లనుదురు, నిన్ను బ్రహ్మాధిపతినిగా ♦ నిగమ వేద్య!

వ. మఱియును.

క॥ నారాయణునిగ నరునిగ, ధీరులు సెప్పుదురు నిన్ను ♦ దెలిసితిని విభూ!
సారసభవుఁడవు నీవే, శ్రీరుద్రుఁడవీవె ♦ తక్కు జేజేలీవే! 49

ఉ॥ నీవలనన్ జగంబులిటు ♦ నెక్కొనె స్థావరజంగమంబులై
యీవిధ మొప్పు ప్రాణములు ♦ నింద్రియముల్ మనముల్ బ్రతీకము
ల్పావకుఁడున్ హవిస్సును స ♦ వంబులు సోముఁడు వేదమంత్రముల్
నీవె మహేశ! దత్తమును ♦ నీవె యధీతము నీవె యారయన్. 50

క॥ నీవే యెల్లరహృదయము, లో వాసముసేయునా య ♦ లోకప్రసిద్ధుఁడౌ
దీవే యణిమవు లఘిమవు, నీవే జ్యోతివి మహాత్మ! ♦ నీకివె ప్రోతల్. 51

## —♦ దండకము ♦—

శ్రీమన్మహాదేవ! దేవాదిదేవా! సుదివ్యత్ప్రభావా! భవాపత్సముత్క్రాంతయోద్విగ్న జీవోద్ధరప్రౌఢభావా! భవా! సర్వగీర్వాణకళ్యాణకోటీరకోటిస్ఫురన్మౌళిజ్వాలదత్నాంచిరంఛోళిచంచద్ ఘృణీజాలనీరాజితాంచత్పదోత్ఫుల్లనాళీక! నాళీకజన్మాదితాళీకవాగ్రపతన్మస్తవిచ్ఛేదనాటీకసవ్యాగ్రహస్తాగ్రభాస్వన్నఖాగ్రా! పరీశస్తేందురేఖాసముత్పింగరంగజ్జటాబంధబందీకృతాకాశగంగా సముద్భృంగభంగాభిషిక్తోత్తమాంగాభిరామా! యుమాదేవి దివ్యాంగరాగోరుసౌగంధ్యనిత్యప్రసక్తప్రసలా! లాలితక్రౌంచభిత్కుంజరేంద్రాననా! పాలితశ్రీశిలాదాత్మజాహ్లాదసంస్తూతాఖిల వేత్రాంశుమాలా పరిక్షిప్తసాన్నిధ్యసంశోభితా! శర్వ! సద్భావనాసాధనానమోదా, వచోభూతవేదా! భవద్దివ్యమాహాత్మ్య మూహింపశక్యుండనే! తావకీనాననద్వారు దేహంబు రూపంబుఁ దేజంబుఁ గారుణ్యభావంబిటుల్ చూపినావన్య మొక్కండుంచకే ధన్యునిన్ జేయవే నిన్ను గన్నారఁగంటిన్ జగంబెన్నఁగొంటిన్ గడున్ హర్షమున్ దర్శమున్ వేగఁబాలింపుమా పల్కులాలింపుమా సర్వలోకేశ్వరా! శంకరా! శ్రీకరా! తేనమస్తేనమస్తేనమః.

గీ॥ ఇట్లు కృష్ణుఁడుపలికిన ♦ నెల్లజగము, లుల్లసిలియున్నెలై యనునట్లు ♦ లోకమునాటు
సింహనాదంబులొనరించి♦ చెలఁగెఁగృష్ణు, శిరమునన్ బుష్పవర్షంబు♦గురిసెమిగుల.

గీ॥ అపుడు భగవానుఁడగు శివుం♦డతిరయమున, దేవియగునుమనున్ శత♦ధృతినిఁజూచి
నలిననేత్రునకనె హరి! ♦ నాదుభక్తి, కరమొనర్చెద వీవు నేఁ ♦ గాంచుచుందు.

## —* శ్రీకృష్ణునకుఁ బార్వతీశివులు వరంబుల నిచ్చుట *—

క॥ ఎనిమిదివరముల నడుగుము, వనజేక్షణ! నీయభీష్ట ♦ వాంఛితముల లే
దన కే నొసంగెదను నా, మన మిది ప్రేమించు నిన్ను ♦ మానక యెపుడున్.

క॥ పరమశివుఁ డిట్లు దగ్గఱి, కరుణఁబలికి నట్టినుడుల ♦ కర్జ మెఱిఁగి తా
మరసాక్షుం డాకృష్ణుఁడు, శిరమున మ్రొక్కులిడి పల్కెఁ ♦ జెన్నుగనిట్టుల్.

చ॥ సుకృతమునందు దార్ఢ్యము య ♦ శోధనమున్ ఘనమాబలంబు శ
త్రుకులవిఘాతమున్ శతసు♦తుల్ వరవిక్రమవిస్ఫురత్తపల్
సకలజనప్రియత్వమును ♦ సారతరోత్తమయోగశక్తి తా
వకముగు సన్నికర్షము శి ♦ వా! యొసగంగఁ దలంతు నర్మిలిన్.

*గీ॥ అనిన నట్లగుఁగా క నె ♦ నమ్మహేశుఁ, డమ్మహేశ్వరి జగదంబ ♦ యనియె నిట్లు
ప్రభుఁ డొసంగను నీమ వ♦రములఁగృష్ణ!, యష్టవరములనేనిత్తు ♦ నల్లకొనుము.

వ. అనుటయు నతం డంబికను శిరంబున మ్రొక్కి యిట్లు వరంబుల నడిగె. 58

గీ॥ పాపలం దల్క లేమియుఁ ♦ బరమభోగ
మును సుతశతంబుఁ గులమందు ♦ ముదముఁ దల్లి
దండ్రియొక్కయు సుప్రసా ♦ దములు శమము
దాక్ష్యము నొసంగు మమ్మ! నెం ♦ తయును జనని! 59

క॥ అనినఁ దథాస్తని త్రిభువన, జనని మఱియు ననియె నమర ♦ సన్నిభ! యెపుడే
నిని నే పలుకకుఁ బల్కను, గనెదవు భార్యాసహస్ర ♦ కౌశల్యంబున్. 60

గీ॥ మఱియు దారలవాల్లభ్య ♦ మరుదమిూఱు, బాంధవప్రేమ మఱియ♦బలముతనరు
నేడువేలు ద్విజులు నీదు ♦ నిమ్మునందుఁ, గుడుతు రిష్టంబు తీరు సే♦కూరు తనువు.

క॥ వరముల నిట్లొసఁగి తగస్, వరదులు శివు లంత దివిజ ♦ వర్గముతోడన్
సరగున నంతర్హితులై, రరుగమ్మునుజెంది కృష్ణుఁ ♦ డంత రయమునన్. 62

వ. గురుండగు నుపమన్యునిఁజేరి మహేశ్వరానుగ్రహం బెఱింగించినంత మురిసి యమ్మహామహుండు పద్మలోచనున కిట్లనియె. 63

---

* శివపురాణే ఉమాసంహితాయాం తృతీయాధ్యాయే - శ్రీకృష్ణ వచనం —

శ్లో॥ ప్రత్యుత్తర మనసాం నిపిహా । దేవదేవ నమోస్తుతే। సర్వేశ్వరస్త్వమేవాసి। మత్ప్రభుశ్చవిశేషతః॥ సనత్కుమార ఉవాచ - తస్యతద్వచనం శ్రుత్వా । తమాహ భగవాన్ భవః । సర్వం భవిష్యతీత్యేవం । పునస్సప్రాహశూలభృత్ ॥ సాంబోనామ మహావీర్యః । పుత్రస్తే భవితాబలీ ......శ్రీకృష్ణ ఉవాచ - శ్లో॥ ఇత్యాద్యాస్సువరాస్సంతు । ప్రసాదాత్తవ పార్వతి॥ సనత్కుమార ఉవాచ - తస్య తద్వచనం శ్రుత్వా । దేవీతంచాహ విస్మితా । ఏవ మస్త్వితిభద్రం తే । శాశ్వతీ సర్వకామదా ॥

॥క లేఁడు శివుఁబోలు వేల్పు, లేఁడు శివున్ బోలు దాత ♦ లీలాకారా!
లేఁడు శివుఁబోలు సులభుఁడు, లేఁడు శివున్ బోలు బిరుదు ♦ లెక్కింపంగన్.

వ. అని సంతసించినంతఁ గృష్ణుం డాయనఘుని సెలవొంది స్వపురంబుఁ జేరి జాంబవతియందు సాంబుండన్ గుమారునిఁ బడసి సుఖంబుండె నిట్లు శ్రీకృష్ణ పుత్రలాభోదంతం బెఱింగించితి నీకేను వినుదురన సూతునకు మునులు మహాత్మా! మున్నెవ్వరెవ్వరు శివమాయామోహితులై జ్ఞానంబుఁ బాసి చరించిరో యట్టివారి నెఱుంగఁ జెప్పి యవ్వలఁ బాపభేదంబులను బాపభోగ్యంబులగు నరకభేదంబుల నెఱింగింపుమనిన సూతుం డలరి యిట్లనియె.

## —* శివమాయా మోహితులు *—

క॥ కమలాక్షుండా విష్ణుఁడు, భ్రమాత్మకంబైన శివుని ♦ బలువగుమాయన్
దెమలంగలేక యనేక, ప్రమదలసాంగత్య మొందెఁ ♦ బలుతెఱఁగులన్. 66

క॥ నలువయు శివమాయఁ గడున్, నలిగి యలవిగానియట్టు ♦ నట్టనిరహిచేఁ
గలయఁగఁ బూనెను గూఁతున్, బలుమఱు లాఁతులనుఁ జూచి ♦ బాళినలదురెన్.

క॥ మీఁదున్ గ్రిందును గనకయె, కాదన కనుచిత్రపురదణిఁ ♦ గానలులసు దున్
గాదిలి చెల్లెలిని వశి, ష్ఠాదులు గనయంగఁ గడఁగి ♦ రభసపునిమాడ్కిన్. 68

వ. మఱియు నజేయంబగు నాశివమాయన్ జేసి.

సీ॥ ఇంద్రుఁడు గౌతమ♦ఋషిపత్ని నాయహ, ల్యను మోసఁజేసి క్రీ♦డనుబాసఱ్ఱె
అగ్ని కృత్తికలను ♦ నార్యురవలచి బ, ల్మరులొంది పాపంబుఁ ♦ బొందెఁగడు దారె
నమ్మహాబలుఁడును♦నంజనిన్ గామించి, క్రీడించి పుట్టించెఁ♦గీశవర్యు
మిత్రావరుణులల్ల♦ మేలఁతనూర్వశిఁ జూచి, గళితతేజస్కులై♦కనిరి సుతులఁ

గీ॥ చందురుఁడు గురువనితతోఁ♦జారతఁ గని, భోగములనొంది తనయుని♦బుధునిఁ గనియె
శాండిలియనాఁగ నొకకన్నె♦సర్పవైరి, వలచి తెక్కలుగాల్పఁగఁ♦బడియె వినుఁడు.

సీ॥ వాచస్పతి యటంచు ♦ వైభవంబున మించు, జీవ్రుఁడగ్రజపత్నిఁ ♦ జెంచెఁదమిని
బ్రహ్మనిభుండు ప♦రాశరుం డల దాశ, కన్యకతోఁ గూడి ♦ కనియె వ్యాసు
ఘనుఁడౌ విభాండక♦ముని లేడిఁగని ముక్త, తేజుఁడై కనియె సు♦ధిసఁ గుమారు
నచ్చరయగు మేన♦యనుపొలంతికిలోఁగి, గాధిపుత్రుఁడు గంగఁ♦గలిపెఁ దనను

గీ॥ ఇఁక భరద్వాజుఁడ నెడువాఁ♦డింద్రుఁడలఘుఁ, డాహరిద్వారమున గంగ♦యందుఁ గ్రీడ
లాడెడు ఘృతాచియను దాని♦నభిలషించి, స్కన్నవీర్యుఁడై కనియెనొ♦క్కనిఁ దనూజు.

వ. వారు వీరన నేల? లోకంబందెల్లవారలు శివమాయామోహితులై కామబాణంబులకు గుఱిగానివారు లేరిది సిద్ధం బిఁకను బాపంబుల తెఱం గెఱింగించెద వినుండు.

## —* పా ప భే ద ము లు *—

క॥ మనసున నాలుగునున్ వాక్కున నాలుగు మూర్తి నాలు♦గును నగు పాపా
లను బొనరించినవారలు, చనుదురు నిరయంబుఁ జేర ♦ సన్మునివర్యుల్! 72

వ. అవి యెవ్వియందురేని వినుండు.

క॥ పరసతినిఁ గవయఁగోరుట, పరధనముల కాసపడుట ♦ భావముచేతన్
బరుల కపకృతినిఁ గోరుట, యిరవుగఁ జెడుపనులఁదలఁచు♦టెపుడుఁదగ వెదక్.

గీ॥ అప్రియముఁ బల్కుటయుఁ గల్ల♦లాడుటయును
గొండెములు సెప్పుటయు నుంతఁ ♦ గొంకులేక
తిట్టుటయు నను నివి నాల్గు ♦ చెట్ట లెపుడు
వాకునెడ దోసములు వీనిఁ ♦ బాయవలయు. 74

క॥ తినఁదగనివి దినుటయుఁ బర,ధనముల దొంగిలుట పరుల ♦ దారలతోఁ గ్రీ
డనుబొనరించుట హింసయు, ననుచితములు దేహమునకు♦నారయవలయున్. 76

వ. తినఁ దగని పదార్థంబుల నెల్లెఱుంగుఁడు.

గీ॥ వినుఁడి రామాంసములును ల♦శునపలాండు శిగ్రువిడ్వరాహంబులు♦ శేలువును న
భక్ష్యములు గాఁగఁ జెప్పఁగ♦బడుట వాని, వర్జనమొనర్పవలె ధర్మ♦పరుఁడుపుడమి.

వ. ఇఁకను సరుసగ దోసంబులను వక్కాణించెద వినుఁడు.

క॥ శివునిన్ గురుఁ దలిదండ్రుల, శివభక్తుని మఱియు శైవ♦శిక్షాచార్యున్
శివశాస్త్రంబుల నెపుడే, నవమతి నిందింపఁగూడ♦దఘమగును గదన్. 78

సీ॥ శివలింగమును జూచి♦చేమోడ్పనట్టిఁడు, శివుగుడిన్ బాలఁతుకఁ ♦ జెందునతఁడు
శివధనంబులను మ్రు♦చ్చిలికొనునాతండు, శివరాత్రిఁబవలుబో ♦ సేయునతఁడు
శివుననిఁబున్నా♦జిని ఛచ్చునట్టిఁడు, శివప్రూజవరాని భు♦జించునతఁడు
శివునకుఁ బెఱవేల్పుఁ♦జింతసేయునతండు, శివునివ్రతంబులఁ ♦ జెఱచునతఁడు

గీ॥ గురునిఁ గొలువక పంతంబుఁ♦గోరునతఁడు, గురునిపరిచర్య సల్పని ♦ కుత్సితుండు
ఆపదన్ గుందుగురుఁ బాసి♦నట్టియతఁడు, చేరుదురు నిరయంబును♦సిద్ధమిద్ది. 78

సీ॥ అసుచిత్తుపేదాధ్య♦యనమొనర్చునతండు, తల్లిదండ్రుల నెప్పు♦డొల్లనతఁడు
పంచయజ్ఞంబులఁ ♦ బాసిమెక్కు నతండు, తను గొప్పగా నెన్ను♦కొనునతండు
చదివిన వేదంబు♦వదలి మఱచినట్టిఁ, డాలను బోయల ♦ కమ్మునతఁడు
దేవభూదేవ వృ♦త్తినిఁ జూఱగొన్నట్టిఁ, డాలమందలు మేయు♦నట్టి పొలము

గీ॥ నాక్రమించిన యట్టిఁడు♦నాల తెరువు,నందు నగ్గినివేసెడు ♦ నట్టియతఁడు
దీనులగువారిసొత్తు నెం♦తేనిఁగొనిన, యట్టిఁడును నిరయంబుల♦నందఁగలరు. 79

క॥ చెఱువులుఁదోఁటలు గుంటలొఁ, నరిచిన వ్రతములను దనదు♦నాతిని సుతలన్
మఱి సుతులను వెలకమ్మెడు, నరుఁడొందఁగలండు ఘోర♦నారక బాధల్. 80

ఆ॥ వినుఁ డనాథయైన♦వెలఁదిని బాలను, వృద్ధురాలి మిగుల ♦ వెఱ మదాని
సతినిఁ దపసుఁజేయు♦చానను వంచన, చేయువారు నరక♦సీమ నుంద్రు 81

క॥ వేదక్రేతలు మఱియు, వేదమున్ దెగడువారు ♦ వేదవిరోధుల్ .
వేదముఁ జూచి పఠించెడు, చేదస్తులు నిరయగతికిఁ ♦ జేరుదు రవలన్. 82

## —* పంచమహాపాపులు *—

క॥ బాపనిఁ జంపినవాఁడు సు, రాపియు గురుతల్పగుఁడు హి♦రణ్యస్తేయుం
డీ పాపులఁ గూడిన పెను, పాపుఁడునుం బంచఘోర♦పాపులు పుడమిన్. 83

సీ॥ గోవిప్రకన్యకా♦గురుకార్యములకు వి, ఘ్నంబు చేసెడునట్టి ♦ కశ్మలుండు
గురుల దోసములేని ♦ కోమలినిన్ బరి, జనులఁ బాసినయట్టి♦ పాపశాలి
చలిపందిరులమేలి ♦ సత్రంబులను సభా, భవనంబులన్ గూల్చు ♦ పంకమూర్తి
బాలవృద్ధులకును ♦ బరిజనులకుఁ బెట్ట, కన్నంబు ముందు ది ♦ న్నట్టి ఖలుఁడు
గీ॥ విల్లు నమ్ముల కత్తుల♦విసము నమ్ము, వాఁడు పశువులకున్ ముకు♦దాడు వేయు
వాఁడు శిలలను మేకుల♦బాటకడ్డి, నేయువాఁడును నిరయంబుఁ ♦ జెందఁగలరు.

ఉ॥ కల్లలనాడువాఁడు గురు ♦ కాంతను నోడక ధిక్కరించువాఁ
డుల్లమునందు నక్కటిక ♦ మూననివాఁ డభిచారకృత్యముల్
పెల్లుగ సల్పువాఁడు ద్విజుఁ♦బిల్చియు సుంతయు నీకపంపువాఁ
డొల్లమి సాధులౌ ద్విజుల ♦ నూరక దూఱెడువాఁడు పాతకుల్. 85

క॥ పరివేత్తయుఁ బరివిత్తియుఁ, దెఱవలనున్ దార్చునతఁడు ♦ దంపున విసమున్
బరులఁ దినిపించువాఁడును, నిరతముఁ గామాతులుఁడయి ♦ నెగడెడువాఁడున్.

క॥ కన్నెను జెఱచెడువాఁడును, గన్నియధన మపహరించు ♦ కఱటి రజముతో
నున్నసతిఁ గూడువాఁడును, బన్నుగఁ బర్వముల రతిసఁ ♦ బడసెడువాఁడున్.

గీ॥ వరుసగానట్టి యువిదతో♦సురతమొందు, నరుఁడునుం గూటసాక్షియుఁ♦ బరులసొమ్ము
దాఁచనిడ నపహృతిచేయు ♦ దారుణుండుఁ, బశువులనుబట్టి క్రీడించు ♦ పాపశాలి.

క॥ ఒకబంతియందునున్ వం, టకమున భేదంబుఁజేయు ♦ టాటోటును దా
నొకవిస్తరి వేసుక తలఁ, కక కుడిచెడువాఁడు నరక ♦ గతులొందు రొగిన్. 89

గీ॥ ఎపుడు దుర్దానములఁగొంచు♦ సేవపడక, కల్మషాత్ములకడఁ బ్రితి♦గ్రహము సేయు
నట్టి బాపఁడు నరిగొంచు ♦ నవనిఁగావ, లేని భూమీశ్వరుఁడును మ♦లీమసు లిల.

క॥ కలిమి కడుఁగలిగి పేదలఁ, దలఁపక తగినట్టి యీవిఁ ♦ దక్కినవారల్
బలమైన రుజను గడుశో, షిలు పేదకు మందు లిడని ♦ చెన్నటినైద్యుల్. 91

క॥ కూలుదురు నరకమునఁ గడుఁ, బేలుదురు భ్రష్టాత్ములగుచు ♦ బిట్టుగ నగ్నిన్
గాలుదురు తెరువుఁగాంచక, సోలుదురు నితాంత భూరి ♦ శోకాతురులై. 92

## —* బ్రహ్మఘ్నసమానులు *—

సీ॥ దప్పిఁజెంది జలంబుఁ♦ద్రావఁగావచ్చు గో, జాతికి విఘ్నంబుఁ ♦ సల్పువాఁడు
వేదశాస్త్రముల ♦ వివేక మించుకలేక, కొంచక సభల దూ♦షించువాఁడు
కడు నందమున నొప్పు ♦ కన్నకూఁతును దగి, నట్టి భర్తకొసఁగ ♦ నట్టివాఁడు
కుడుసంగరమ్మని ♦ గుణశాలియగుబ్రాహ్మ, ణునిఁబిల్చిమరలఁ బో♦మ్మనెడువాఁడు

గీ॥ మఠిఁను గోష్ఠైవతంబుల♦మాన్యములను, బాడబునివృత్తిహరియించు♦ వాఁడునంధ
పంగులజడదరిద్రిణములఁ♦బడయుఁవాఁడు, బ్రహ్మఘాతులుగాఁజెప్ప♦బడుదురిలను.

గీ॥ చెలిమిఁజేయుచునహితంబు♦చేయునతఁడు, పిలిచియువిపాన్నమునుదిని♦పించునతడు
కనుచుహింసనుమాన్పని ♦ ఘాతుకుండు, నరకమునఁ బొక్కుచుందు ర♦నారతంబు.

గీ॥ వీరలందఱు నొకవైపు ♦ వినుఁడుమీరు, మేలు చేసిన వారికి ♦ మీఱి కీడు
చేయువాఁడును నట్టులఁ ♦ జేయఁదలఁపు, చేయువాఁడును నొకవైపుఁ ♦ జేరగలరు.

క॥ పధులకలిమికిని సంతుకుఁ, బరుల మహోన్నత్వమునకుఁ ♦ బాయక మదిలో
మఱుఁగుచునుండెడిచెనఁటులు, చిరకాలము నరకబాధఁ ♦ జెందుదురు మునుల్!

సీ॥ భూదానమొనరించి ♦ భూమినీయక తామె, యనుభవించుచునున్న ♦ యట్టివారు
గోదానమొనరించి♦గోద్రవ్యమును దామె, యారగింపుచునున్న ♦ యట్టివారు
కన్యకాదాన మ♦క్కఱఁజేసి కూఁతును, నల్లున కంపని ♦ యట్టివారు
సత్రంబు లమరించి ♦ చాలఁగ నన్నాని, యద్దెల కిచ్చుకొ ♦ న్నట్టివారు

గీ॥ జన్మములొనగ్నుమనుమ వి♦స్తారధనము, నార్జన మొనర్చి యటుసల్ప♦నట్టివారు
విత్తముల నప్పఁగొని యెగ♦వేయువారు, చేరుదురు నరకార్తిని ♦ సిద్ధముగను.

గీ॥ ఆలుమగలును దలి ♦ దండ్రు లాత్మజాతు, లన్నదమ్ములు మిత్రులు ♦ నల్లెగురువు
శిష్యుఁడును వీరలకుఁగల ♦ చెలిమిఁబాపి, కొంకకవిరోధమును♦ నొడగూర్చువారు

క॥ కలుదోసంబులు తనయెడఁ, గలిగియు వేఱొకరియందుఁ ♦ గలుగకయున్నన్
జలమునఁ బరులను దెగడెదు, పలుగాకులు దెఱపిగొనని ♦ పాపులు పుడమిన్.

గీ॥ పసులమేఁతల పంటకు♦ప్పలను బరులఁ,యిండ్లఁగాల్చెడువారు డ♦బ్బీయకప్పు
పత్రముల సృష్టిచేసెడు♦వారు పరులఁ, జంపువా రొందుదురు నర♦కంపువసతి.

ఆ॥ అడవి నిరపరాధు♦లై యుండుప్రాణుల, హత్యసేయువాఁడు ♦ నాలఁగట్టి
ప్రొలముదున్ను వాఁడు♦పొంకమొప్పఁగ నెద్దు, నెక్కువాఁడునిరయ♦మేగఁగలరు.

క॥ అతికోపను లతిలోలుపు, లతికాముల లతిపిశునులు ♦ నతిగర్వులు నెం
దతివచనులు నతిభక్షులుఁ, గుతుకంబఱ యమునిశిక్ష♦కుఁ బాత్రింబుల్. 102

—* న ర క ము లు *—

వ. ఇఁకను వారల కందఱ కవశ్యానుభోగ్యంబులగు నారకభేదంబుల నెఱింగించెద వినుండు. నిరయంబు లష్టావింశతిపరిమితంబులుగ విద్వాంసులు లెక్కపెట్టిరి. రౌరవంబు, మహారౌరవంబు, తామిస్రం, బంధతామిస్రంబు, కుంభీపాకంబు, కాలసూత్రం, బసిపత్రవనంబు, సూకరముఖం, బంధకూపంబు, కృమికుపంబు, కృమిభోజనంబు, తప్తవాలుకంబు, వజ్రకంటకంబు, శాల్మలియు వైతరణియుఁ, బూయోదంబును, విశసనంబును, లాలాభక్షణంబును, సారమేయాదనంబును, నవీచియు, నథశ్శిరంబును, క్షారకర్దమంబును, రక్షోగణంబును, శూలప్రోతంబును, దందశూకంబును, వటారోధంబును, మహాజ్వాలంబును, సూచీముఖంబును ననునవియు మఱియు నీయవి యొక్కొక్కఁ డైదువిధంబులతో నొప్పి నూటనలునది విధంబులై పరఁగు నిందు యామ్యకింకరులు పాపులఁబట్టి పలువిధంబుల బాధించి వేధించుచుందు రిట్టిపాపుల ఘోరదుఃఖంబులఁ బాయఁజాలు దానధర్మంబుల నెఱింగింతు వినుండు. 103

—* పాపహరంబులగు దానధర్మములు *—

*గీ॥ ధేనుభూ తిల హేమాజ్య ♦ దివ్యవస్త్ర, ధాన్య గుడ రౌప్యలవణము♦లుద్ధరింప
బ్రాహ్మణులకీవలయు నివి ♦ పదియు మేటి, దానములు సర్వదోషని♦వారకములు.

గీ॥ మేక గేదెయు గోఱియయు♦మేలిదాసి, యీను మస్నట్టి యావును♦సిలయుఁ గన్య
పసిఁడియేనుఁగుగుఱ్ఱంబు♦బండినాగ, లిల్లు ననశ్వాహమును గనుు♦నయముమీఱ.

క॥ పల్లకియును సెజ్జయునున్, బెల్లగు ధాన్యములు లిల్లు ♦ బృందముగలదా
నిల్లు పదియాఱు వీనిని, నుల్లసిలుచు నగ్రజనుల ♦ కొసఁగఁగవలయున్. 106

క॥ లలితోపానహపాదుక, లలరెడు ఛత్రంబునున్ ధ ♦ రామరుల కిడన్
విలసిలు యానంబులు ల, క్ష్ముల కిరవగు నిరవు గలుగు ♦ శుభచారిత్రుల్ !

వ. మఱియును.

* శ్లో॥ గోభూతిల హిరణ్యాజ్య । వాసోధాన్య గుడానిచ । రౌప్యం లవణమిత్యాహుః । దశదానాని కోవిదాః.

క॥ పీటలు రతనాల్ రజతము, నేటగు పరిజనుఁడును నవ ♦ నీతము ఫలము
ల్గాటపు దధి తాంబూలము, లాటంకముఁ దక్కి యొసఁగ ♦ నగు బాపలకున్.

వ. వెండియు నీకుఁ దశాశ్వపురుషదానం బనన్యసాధారణం బని యివి యననేల? యిష్టవస్తువు లన్నియును దానార్హంబు లవ్వాని యోజించి సమయానుసారంబరు
లకు నొసంగవలయును 109

ఉ॥ అన్నముచేతఁ బ్రాణిచయ ♦ మంతయు నాయువుఁ జెందియుండు నా
యన్నము లేనియప్డు విల ♦ యంబును జెందును గాన లోకమం
దన్నమె ప్రాణతంబయి సు♦ఖావహమై కర మొప్పియుండు నా
యన్నము నిచ్చువారి బర ♦ మాత్మము మెచ్చు వదాన్యవర్యులన్. 110

వ. కావున

గీ॥ దానములలోన నుత్తమ ♦ దానమన్న, దానమిద్దానఁ గులము గో♦త్రంబుఁ గనక
యెల్లవారల కోదనం ♦ బీవలయును, సర్వసౌఖ్యంబు లిదియిచ్చు ♦ స్వర్గమిచ్చు.

చ॥ ఉదకము సర్వజంతువుల ♦ కొప్పుగ ద్రావఁగఁ జెల్లుఁ దొట్లయం
దుదకము పోసియుంచ నది ♦ యొండెడు నాలు వృషంబు లింక నిం
పొదవ ననేక జంతుతతి ♦ యొందు జలంబును నట్టులౌట మీ
రిది మదియం దెఱింగి సతి ♦ మిచ్చ నొనర్పుఁడు నీరదానముల్. 112

వ. ఇంకను.

క॥ తలిదండ్రులఁ గొలుచుట యొ, జ్జలఁ గొలుచుట నతిథి రిక్త ♦ జనులకు నన్నం
బులనిచ్చుట పడబాపులఁ, గొలఁకులఁ జెరువులను ద్రవ్వి ♦ కూర్చు సుకృతమా.

క॥ చలిపందిరులను నీకుఁ బూ, వులతోఁటలు ఫలకుజములు ♦ పొల్చెడు తోపు
ల్వెలసిలెడు సస్యక్షేత్రము, లలరుచుఁ గూర్పంగ నాక ♦ మాతని కబ్బున్.

క॥ ఇలఁ బాఠశాలలును వా, చకమందిరములును బాట ♦ సత్తరువులునున్
రకమగు భజనగృహంబు లు, త్సుకుఁడై కూర్చిన నభీష్ట ♦ సుఖముల నొందున్.

గీ॥ శర్వ గౌరీషడాస్య గ♦జముఖ వీర, భద్రకాళీ కాల ♦ భైరవాయ
తనములునుసందిగావిష్ణు♦ధామములును,దదవతారాయతనములు♦దార్చుముదము

క॥ బాలురకుఁ జదువుఁ జెప్పుట, యోలిగ నన్నంబు బట్ట ♦ లొసగుటయు గడున్
వీలుగఁ బాత్రము లిచ్చుట, చాలఁగ సుకృతంబొసఁగు ♦ శర్మము లిచ్చున్.

గీ॥ మట్టి మామిడిమున్నగు♦మ్రాకులను బ, థమ్మునందు వరుసగ సం♦ధానమొనరఁ
జేయువాఁడును దపసును♦జేయువాఁడు, బొంకనట్టిఁడు శ్రేయంబుఁ♦ బొందఁగలరు.

వ. ఈ చెప్పినవన్నియుఁ బాపహరంబులై యొప్పు నందు గోభూదానంబు లుత్తమోత్తమంబులు; అందునుఁగ గోదానమందు. 119

గీ॥ వెండిగిట్టెలతోడఁ బ♦సిండికొమ్ము, దోయితోఁ గంచుపాత్రితో ♦ దూడతోడఁ బటముతో గ్రాసములతోడఁ ♦ బాడిమొదవుఁ, దగినవిప్రునకీనలె ♦ ధనముతోడ.

క॥ అటులిచ్చిన నాధేనువు, కుటిలమతిగ జేసినట్టి ♦ ఘోరతరాంహః పటలములనెల్లఁ గూలిచి, పటుసౌఖ్యములిచ్చు స్వర్గ ♦ పదములనిచ్చుఁగ. 121

గీ॥ ఎన్నిరోమంబు లావుయం♦దెసఁగియుండు, నన్నివత్సరములు నా♦క♦మందు బాతచేరియుండును దరియింతుని ♦ సిద్ధముగను, సప్తపురుషులనటకు నం♦శంబునందు.

వ. ఇఁక సర్వధర్మానుష్ఠానయోగ్యంబగు భూమండలంబు తెఱం గెఱుంగవలయు నగుట నుపన్యసించెద నాలకింపుడు భూవలయంబునందు, జంబూ, ప్లక్ష, శాల్మలీ, కుశ, క్రౌంచ, శాక, పుష్కరనామకంబులగు సప్తద్వీపంబులు లవణేక్షుసురా సర్పిర్దధిక్షీరజలార్ణవశోభితంబులై యెసంగు. 123

## —* భూమి సప్తద్వీపములు *—

క॥ భూపద్మమధ్యజంబూ, ద్వీపము యోజనపు లక్ష ♦ వెడలుపు నటులే యా పొడవును గలిగి కదుఁగ, శ్రీపదనై యొప్పు లవణ ♦ సింధువృతంబై.

గీ॥ లలితముగ దీనిమధ్య ని♦లావృతంబు, వర్ష మొప్పెసుఁ దన్మధ్య ♦ వాసిమీఱి మేరుశైలంబు ధారుణీ ♦ నీరజమునఁ, గర్ణికాకృతిఁ దనరుఁ బొం♦కంబుమీఱి.

వ. ఇక్కనకపర్వతంబు పదియాఱు యోజనంబు లధఃప్రదేశంబునఁ దిగుభాగామిగను భూమినుండి యెనుబదినాలుగు యోజనంబులు పొడవుగను నందు బదియాఱు యోజనంబులు శిఖరంబులుగను జెలువొందియుండు నిఁక నిద్దానికి దక్కసంబున నిషధహేమకూట హిమాచలంబులును నుత్తరంబున నీలశ్వేతశృంగి పర్వతంబు లును భాసిల్లియుండు. ఈయవి పదివేల యోజనంబుల పరిమితితో రత్నసంతానంబులై యరుణప్రభలు గలిగి యొప్పొందు నిఁక నిలావృతవర్షంబుతోఁ గూడఁ దొమ్మిది యగు భారతాదివర్షంబు లొక్కొక్కటి తొమ్మిదివేల విస్తారంబుతోఁ గులశైలంబులతో నొప్పుచుండు. భారతవర్షము కింపురుషవర్షము హరివర్షము కేతుమాలవర్షము భద్రవర్ష మిలావృతవర్షము రమ్యకవర్షము హిరణ్మయ వర్షము కురువర్ష మనునవి. అందు మేరువునకు దక్షిణంబున భారత కింపురుష హరివర్షంబులును నుత్తరంబున రమ్యక హిరణ్మయ కురువర్షంబులును మధ్యంబున నిలావృతవర్షంబును దూర్పున భద్రాశ్వవర్షంబును బడమట కేతుమాల వర్షంబును బరంగునిఁక నిట్లే యీ మేరువునకుఁ బూర్వాది చతుర్దిశలందు

మందర గంధమాదన విపుల సుపార్శ్వంబులను పర్వతంబులును దచ్ఛిఖరంబు
లందుఁ గదంబజంబూపిప్పలవట వృక్షంబు లొప్పియుండును. 127

క॥ జంబూవృక్షములందు గ, జంబులఁ దుల సేయునట్టి ♦ చక్కనిపండ్లో
జం బ్రఫలవిగాలి యవియఁగ, జంబూనది యొదవెఁ దద్రి♦సంబున నచటన్. 128

గీ॥ ఆనదీతీరమున నున్న ♦ యఖిల జనులు
తోయముఁగ నానదీ స్వాదు ♦ తోయమును భృ
శముగ దోయిళులన్ ద్రావి ♦ యమృతరసముఁ
గాఁగఁ బాటించి మోదంబుఁ ♦ గాంతు రిమ్మిగుల.

క॥ అది త్రావిసవారలకె, స్వేదవదు దుర్గంధము జర ♦ యును జెమటయునున్
బ్రిమాలస్ప బిగి నిందిృయములు, మదికుత్సాహంబు లగ్గు ♦ మఱిమఱి గూర్చున్.

క॥ ఇందలి మృత్తికతోడన్, గుందన మదియొదవు మగల ♦ కుం గొమ్మలకున్
జెందించుఁగాంతి సగలను, బొందించును హాసమిడు న♦పూర్వతరముగాన్.

వ. ఇట్టి మేరువునకుఁ బూర్వమునఁ జైత్రరథంబును దక్షిణంబున గంధమాదనంబును
బడమట విభ్రాజంబును నుత్తరంబున నందనవనంబు నను వనంబులును అరు
ణోదంబు మహాభద్రంబు శీతోదంబు మానసంబు నను సరస్సులును బూర్వాదిగ
నొప్పుచుండు మఱియును శీతాంజనంబును గురంగంబును గురరంబును మాల్య
వంతంబునను శైలంబులు మేరువునకు బూర్వకేసరాచలంబులుగను, త్రికూట
శిశిరపతంగరుచకనిషధకపిలగిరులు దక్షిణకేసరాచలంబులుగను సినీవాసము కుసుం
భము, కపిలము నారదము నాగముమున్నగు నగంబులు పశ్చిమకేసరాచలంబులు
గను శంఖచూడ ఋషభహంస కాలంజర పర్వతంబు లుత్తరకేసరాచలంబులు
గను నొప్పుచుండు నిట్టి మేరువుమీఁద మధ్యభాగంబందుఁ గనకమయంబగు
బ్రహ్మపురంబు పదునాల్గువేలయోజనంబులపరిమితితోఁ జెలువొందు.

గీ॥ ఈవిధి పురంబునకుఁజుట్టు ♦ నెంతయేని, యష్టదిక్కులయందేచి ♦ యష్టలోక
పాలకులపట్టణంబులు ♦ వి[illegible]మీఱు, దివ్యజనులందఱుందురు ♦ దీప్తి నందు.

వ. మఱియు నిద్దానికి విష్ణుపదవినిష్క్రాంతయగు గంగానది సీతయని, యలకనంద
యని చక్షువని, భద్రయని నాల్గుపేరులతోఁ దూర్పునుండి నలుదెసల నానాశైల
వనస్థలుల దాఁటి యంబుధిఁ జేరు. 133

గీ॥ మేరుగిరిఁజుట్టుకొనియున్న ♦ ధాత్రణీధ్రి, దరులయందును నందనో ♦ ద్యానవనుల
దివ్యజను లప్సరస్సుద ♦ తీరతముల, సంతతంబు సుఖింతురు ♦ శంకదక్కి. 134

క॥ భారతవర్షంబిలకను దు, మేరుగిరికి దక్షిణమున ♦ సంద్రమున కుద
గ్ధారుణీస్థ్యు తగుఁ బ్రదివ, భూరిసుఖంబులకునిద్ధి ♦ మూలమయితగున్. 135

గీ॥ ద్వీపనవకంబులం దిది ♦ తేజరిల్లు, నవసహస్రపరిమితితో ♦ నగవదు వున
దూర్పునఁగిరాతులుందు రి♦మర్త బడమర, దక్షిణంబున యవనులు♦పగఁ జరింత్రు.

క॥ మఱియుత్తరమునఁబాపను, లురువుగ బ్రాహ్మణులు క్షత్రి♦యులుఁ విటుగ్రుల్
పరఁగుదు రిజ్యాజితులా, పరిచర్యలఁ గుశలు లగుదుఁ ♦ బ్రాపించునసరి.

వ. ఇంక నిందుపవర్షంబు లింద్రద్యుమ్న కసేరు తామ్రపర్ణ గభస్తిమన్నాగద్వీప సౌమ్య గంధర్వ వారుణ భారత సంజ్ఞల నొప్పుచుండు. ఇది యోజనసహస్రవిస్తృతమగు నిందు మహేంద్రము మలయము సహ్యము సుదామము ఋక్షపర్వతము వింధ్యము పారియాత్రము నను కులపర్వతంబు లేడును మహేంద్రగిరిజాతంబులగు త్రియామ ఋషికుల్యా మున్నగు నదీనదంబులును శుక్తిమత్పర్వతజాతంబులగు ఋషికుల్యా కుమారి మొదలగు నదీనదంబులును మలయపర్వతసంభవంబులగు కృతమాల తామ్రపర్ణి మున్నగు నదీతిలకంబులును సహ్యపర్వతసంభవంబులగు కృష్ణవేణి మున్నగు మహానదులును ఋక్షపర్వతవినిర్గతంబులగు గోదావరి భీమరథి మున్నగు మహావాహినులును వింధ్యోద్భవంబులగు పయోదాసురస మున్నగు మహానదులును మంచుఁగొండనుండి ప్రవహించిన గంగయమునా సింధు బ్రహ్మపుత్రి మొదలగుతటినీపతంసములును గలవు. ఇందుఁగృతత్రేతాద్వాపర కలియుగంబులానటిల్లుచుండు. ఈభారతవర్షంబునఁ దపంబును దానంబును నిత్యాగ్ని పూజనంబులు నెక్కుడొనర్తు రిది కర్మభూమియని పేర్కొందినది భూమండలంబు దెల్ల జంబూద్వీపంబును, సందునను భారతవర్షంబును శ్రేష్ఠంబని పండితులు వచింతు రన్యంబులు భోగభూములు. వేయింటికొక్కఁడైనను జన్మించును స్వర్గాప వర్గాస్పదమార్గంబగు నీభారతవర్షంబునఁ బుట్టుటకు దేవతలు నాసక్తులై యుందురు దక్షిణవర్షంబులతో నొప్పు లక్షయోజనవిస్తృతంబగు జంబూద్వీపంబు నింతగ తెలిపితి నింక దీనికన్న ద్విగుణంబు ప్లక్షద్వీపం బందుని సముద్రంబు పరిఖయై కందకంబై యుండు నందు గోమంతము చంద్రము నారదము దుందుభము సోమకము సుమనశ్శైలము వైభ్రాజంబను పర్వతంబులుండు నిందు దేవగంధర్వులు నివాసముగా వసింతు రిందలి జనంబులు పదివేలేండ్లు జీవింతురిందు, అనుతప్త, శిఖి, పాపఘ్ని, త్రిదివ, కృప, అమృత, సుకృత యనెడు నేడునదులు ప్రవహించుచుండు నా నద్యుదకమును సంతోసంబుతో సంపటుఁ ద్రావుదురు. ఇందు యుగ వ్యవస్థ లేదు. ఎల్లప్పుడు త్రేతాయుగంబుఁబోలి యుండును. బ్రాహ్మణక్షత్రియ వైశ్య శూద్రులు స్వధర్మపరులై 138

క॥ శంకరుని సర్వవిష్టప, శంకరు నింక సారసాక్షు ♦ సారసభవులన్
సంకటహారులను గొలుచుచు, జంకక యుందురు నితాంత ♦ సంతుష్టులునై. 139

వ. ఈద్వీపమధ్యమందు జువ్విమ్రాను మధ్యమందుండుటన్ జేసి యిది ప్లక్షద్వీపంబయ్యె నీప్లక్షద్వీపంబు నావరించి యిక్షురసార్ణవంబు చుట్టియుండు నద్దానిపైన శాల్మలి ద్వీపంబు పూర్వద్వీపంబుకన్న ద్విగుణంబై యొప్పు నందు శ్వేతము హారితము జీమూతము రోహితము వైకలము మానసము సుప్రభ మనునవి యేడు వర్షం బులుండును. ఇందు పుణ్యోదకంబులు సుశీతలంబులును నగు శుక్ల, రక్త, హిరణ్యా, చంద్ర, శుభ్ర, విమోచన, నివృత్తి, యను నేడు నదులు ప్రవహించుచుండును. ఇందుల్లప్రజ భగవంతుని శంభుని బూజించుచుందురీ ద్వీపంబందు బూరుగచెట్టు మధ్యమం దుండుట నిట్టిశాల్మలి ద్వీపంబని పేరొందె నిద్దాని సురాసముద్రం బావ రించి యుండు నీయది కుశద్వీపంబు పూర్వద్వీపంబుకన్న ద్విగుణంబు, అందు రక్క సులు పిశాచులు కింపురుషులు బ్రాహ్మణాది నాల్గుజాతులతో నొప్పుమానిసు లుందురు. వీరందరు బ్రహ్మమూర్తులం బూజింతురు. కుశేశయము, హరి, ద్యుతి మంతము, పుష్పవంతము, మణిద్రుమము, హేమకూటము, మందరం, బనెడుపర్వ తంబులుండును. ధూతపాప, శివ పవిత్ర సమ్మతి, విద్య, దంభ మహియను పేరు లతో నొప్పు నదులుండును. ఈ కుశద్వీపంబుమధ్య కుశస్తంభ మొప్పియుండు. ఇది నేతిసముద్రముచేత సమావృతంబైయుండు. క్రౌంచద్వీపంబు తద్ద్విగుణంబు, దధిసముద్రసమావృతంబిద్ది క్రౌంచము, వామనము, అంధకారకము, దివావృతి, మనస్సు, పుండరీకము, దుందుభి యను వర్షంబులతో నొప్పియుండు. గౌరి కుము ద్వతి సంధ్య రాత్రి మనోజవ శాంతి పుండరీక యనునదులు శుభోదకంబులు పింగళ్యాది లోకంబులు ప్రవహించు నిందు సువర్ణశోభితంబులగు వర్షశైలంబులందు దేవగణంబులు బ్రహ్మవిష్ణుశివాదులు రుద్రుండు యోగియగు రుద్రుండు నర్చింపబడుచుండును. క్రౌంచంబను పర్వతం బిద్దానిమధ్యనుండుట నిది క్రౌంచ ద్వీపంబనంబడు నీశాకద్వీపము శాకవృక్షాధిష్ఠితంబు పూర్వద్వీపంబుకన్న ద్విగుణంబు, క్షీరసముద్రసమావృతంబు. ఇం దుదయగిరి, జలధార, మస్త గిరి, శ్యామము, కేసరి, శతకేసరము, దేవయానంబనెడు పర్వతంబులును, సుకు మారి, కుమారి, నళిని, వేణుక, ఇక్షు, రేణుక, గభస్తి యను నదులును జెలు వొందు నాల్గుజాతుల మనుజులుందురు. ఇందు భగవానుండగు సూర్యుండు పూజింపబడుచుండును. పాలసముద్రం బవ్వలం బుష్కరద్వీపంబుండు పూర్వద్వీపం బుకన్న నిది ద్విగుణంబు. శుద్ధోదకసముద్రసమావృతం బిందు మధ్యంబున హేమ పుష్కరం బొప్పియుండు నట్లగుటన్ జేసి యద్ది పుష్కరద్వీపం బనంబడు నాకాం చనరు కేశయము బ్రహ్మదేవునికి నివాసంబు ఈద్వీప మధ్యమందు మానసోత్త రంబను పర్వతంబుండు నిది పూర్వాపరంబులనుండు వర్షంబులకు మర్యాదపర్వ తంబుగ నుండు. మఱియు నా మానసోత్తరపర్వతంబు చివర సూర్యరథచక్రంబు

నిరంతరంబు మేరుప్రదక్షిణంబు సేయుచు నహోరాత్రంబులఁ దనరఁజేయుచుండు.
ఇందు దివ్యులు పద్మాసనుని బూజింపుచు రుగ్జరా దుఃఖ రాగద్వేషాధర్మంబులు
లేక పదివేలసంవత్సరంబులు జీవింతు రిట్లు సప్తద్వీపంబులతోఁ బర్వతంబులతో
ధాత్రీమండలంబు పంచాశత్కోటివిస్తీర్ణంబై విరాజిల్లు నిట్లు భూగోళంబు తెలం
గెఱింగించితి నిఁక భగోళంబుఁ దెఱింగింతు వినుఁడు. 140

—* భ గో ళ ము *—

క॥ ఇలపైని లక్షయోజన, ములపై రవిమండలంబు ♦ పొలుపెసఁగును స
ర్వాలను బయి లక్షయోజన, ములమీఁదన్ జందురుండు ♦ మురువుగనుండున్.

గీ॥ వెలయునటుపయి నొకపది♦వేలయోజ, నములపై బుక్షములు దీప్తి♦లమర నట్టి
తారకామండలముపైని♦దనరుబుధుఁడు, బుధునకు నూర్ధ్వంబునందుఁగా♦వ్యుఁడుదనరు

క॥ ఆకావ్యున కూర్ధ్వంబున, నాకుజుఁ డుల్లసిలు నింక ♦ నంతకుమీఁదన్
శ్రీకరుఁడైన బృహస్పతి, జోకగఁదనరారు నతుల ♦ శోభలు దనరన్. 143

గీ॥ అందుపైని శనైశ్చరుం♦డమరియుండు, నానర నాతనిపై లక్ష ♦ యోజనములు
పైని సప్తర్షిమండలి ♦ పరిఢవిల్లు, నందుపై లక్షయోజనా ♦ యామమందు. 144

క॥ ధ్రువుఁ డుండు నాతనికిఁబై, రవికాంతుల సీసడించు ♦ రమ్యాతిరమహర్లో
భువనము చెలువొందు నజో, ద్భవులగు సనకాదులందు ♦ భాసిలుదు రొగిన్.

వ. ఆపైని జనలోకంబు వెలయు నందుపై రాజు లుల్లసిల్లుచుందు రద్దానిపైఁ దపో
లోకం బలరు నందుఁ దపస్వు లుందు రటుపైఁ గడుదవ్వున బ్రహ్మలోకం బుండు
నద్ది భూలోకంబున కెనిమిదికోట్ల యోజనంబులపైనలరు. 146

గీ॥ అందు బ్రహ్మణితోఁ జతు♦రాననుండు, వేదఘోషంబు చెలయుఁగ ♦ వెలుఁగుచుండు
కుదురుగా నట కెన్మిది♦కోట్లయోజ, నములపై నుండు వైకుంఠ ♦ నగరభూమి.

క॥ అందున నిందిరతో సర, విందాక్షుఁడు పార్షదౌఘ ♦ బృందంబులతో
డం దనరియుండు నచ్చోట, నుందురు చెలువొంద విష్ణు♦నిష్ఠాముముక్షుల్.

వ. అచ్చోటికిఁ బదియాఱుకోట్ల యోజనంబులపైని మహాకైలాసం బుండు. అద్దాని
పైని వేఱొండు లేదు. 149

గీ॥ ఇందు బాలేందుమౌళి మ♦హేశ్వరుండు, అమ్మహేశ్వరితో నతి ♦ వ్యాలసుచుండు
కోట్లకొలఁదిగఁ బ్రమథులు♦గూర్మిసేన, లాచరించుచునుందురు ♦ నాగమనము.

వ. ఇఁక నందు ముక్తిత్రయంబునొందిన మాహేశ్వరులు సంతతం బీశ్వరుని సాన్ని
ధ్యంబందుండి యవ్వారిఁ గొలుచుచుందు రద్దానికి సమీపస్థలి సమీపంబున గోలో
కంబం దాలఁ బాలించుచు రాధాసనాథుండు కృష్ణుండు వసించి నిచ్చలు గోక్షీ

రంబులఁ దెచ్చి మహేశ్వరుని కల్పించి యర్చించి మహేశ్వరానుగ్రహంబుఁ బడయుచుండు నిది భగోళస్వరూపం బిఁకను మహీతలంబున కధఃప్రదేశంబగు పాతాళంబుఁగూర్చి చెప్పెద వినుండు. 151

## —* పాతాళములు *—

క॥ వసుమతి కధఃస్థలంబున, నెసఁగును బాతాళ మట ను♦పేంద్రునియంశం
బనఁ బ్రభుఁ డనఁ గేంద్రుఁడు తల,ల సుమంబులవలె జగంబు♦లన్ దాల్చుమునుల్!

గీ॥ మణివితతివిరంజితాయత♦ఫణిసహస్రముల ననలసంయుతశ్వేత♦భూధ్రమట్లు
శేషుఁడొప్పఁ దనుండు స♦శేషసుగుణభూషితుండయి పాతాళ♦భూమియందు.

క॥ మఱియును బడిగెలబారుల, విరిదండలఁ జాలఁదాల్చి ♦ విష్ణుపదీవి
స్ఫురితరజతాద్రిఁ బోలుచుఁ, గరముల రెండు దందశూక♦ఘనుఁ డచ్చోటన్. 154

గీ॥ పొంకమగు స్తనతటీనలఁ♦బోలి మెఱయు, నాగకన్యలు గొలువ నా♦నందమునను
బ్రహ్మదేవుని యనుమతిఁ♦బట్టి యెపుడు, భువనముల నెల్లఁ దలలను♦మోయుచుండు.

క॥ కడుభయదమగు విషాగ్నిన్, గడుకొని బుసకొట్టుచుండుఁ ♦ గద్రూతనయుం
డడఁగుచుఁ గల్పాంతంబుల, వెడలిచి యవ్విసము భువన♦వితతిన్ గాల్చున్. 156

వ. మఱియు.

గీ॥ మహితభుజాగ్ని తన్నిర్మితమ్ము♦సుహితుఁడౌతఁ, డప్పుడే నావలించిన♦నీయిలాత
లంబు కాననశైలములతోడఁ, జలనమొందెడుఁ బ్రజలెంతొ♦యులుకుఁజెంద.

వ. ఇఁకనీ పాతాళంబులు పదివేల యోజనంబుల విస్తారంబుతోఁ గ్రిందుగఁ గ్రిందుగ, నతల వితల సుతల రసాతల తలాతల మహాతల పాతాళంబులను పేరులతో నేడు లోకంబులుండును. 158

క॥ ఈయవి రత్నప్రాసా, దాయతములు హేమభూము♦లతిసుఖదంబుల్
పాయక యిందు వసించెద, రాయసురవరేణ్యులు పన♦గాశనజాతుల్. 159

క॥ రాఁడిటకుఁ దినముఁడును శశి, రాఁడిటకు గ్రహంబులుడులు♦రావిఁక నెపుడున్
బోడిమిని మెఱఁగ మణులే, జాడను వెలుఁగును దనర్చు ♦ సంబరమొసవన్.

వ. మఱియు నందు

క॥ వనములు పుంస్కోకిలరుతి, ఘనములు కాసారములు వి♦కచపద్మ సుజీ
వనములు శాశ్వతయావన, ధనవతు లందంబు మించు ♦ తన్వీశ్రేష్ఠల్

గీ॥ భక్ష్యభోజ్యాన్న పానముల్♦బహువిధములు, జాళువాపట్టువస్త్రముల్♦సౌరభమున
నొప్పు లేపనములు తావి♦పుష్పములును, రవలసొమ్ములు నింటింట♦రాసులొప్పు.

వ. మెండియు వీణావేణుమృదంగసంగీతనాదంబు లెంతేనియు సంతసం బొసంగసిద్ధ
పూరుషులు దానవులు కాద్రవేయు లచ్చోట సుఖంబు లనుభవించుచుందురిట్లధో
లోకంబుల స్వరూపంబు నేర్పడన్ జెప్పితి నిఁక నెల్లధర్మంబులందు స్త్రీరక్షణం
బవసరంబు. స్త్రీరక్షణం బొనర్చకొనకున్న సర్వారు చెడి సంకరంబొనర్చెద
రట్లు గావున మున్ముందు వారల మనంబెఱుంగుట కర్జంబగుట నద్దాని దేటఁబ
ఱతు వినుండు. 163

క॥ నారదుఁ డొక్కపు డచ్చర, యా రామను బంచచూడ ♦ నరుగ సమ్మనసరన్
జేరి యడిగె స్త్రీమానస, చారిత్రంబును నెఱుంగు ♦ చక్కటి సంతస్. 164

—* పంచచూడ స్త్రీస్వభావము నారదమునికిఁ జెప్పుట *—

గీ॥ పంచచూడయుఁ గేళ్మోడ్చి ♦ పలికెనిట్లు, మునికి దేవర! నేనును ♦ బోటినైన యె
ట్లువచింపుదుఁ బోఁతులఁ ♦ తెలఁపుపోలుపు, నాయమగునో ఋషీ! యట్టిదం ♦ సంబునాకు.

చ॥ అనవుడు మౌని యిట్లనియె ♦ నచ్చర లేమగు నాతిమిన్న! బోం
కును వచియింప దోసమగుఁ ♦ గూడ దటుల్ నిజమానవస్వభావమున్
వినిచిన నేర మెట్లొనరు? ♦ వేగ మెచెప్పుము నీముఖంబునన్
వినఁగఁ దలంచినాఁడ నిటు ♦ నెగ్గలమైన కుతూహలంబునన్. 166

క॥ అనుటయు నారదమౌనికి, వినయమ్మున స్త్రీల తెఱఁగు ♦ వినిపింప మన
మ్మునఁబూని చారుహాసిని, యనియె నిటుల్ చెపుదువిను మ ♦ హాత్మా! ముదమునన్.

గీ॥ మంచికులమునఁబొడమిన ♦ మానినులును, రూపవతులును నాథుని ♦ ప్రాపుగలుగు
వార లుచితంపుమర్యాద ♦ మీఱుదురిదె, స్త్రీలయందుపలిదోసంబు ♦ శిష్టచరిత!

క॥ విను మువిదకన్న లోకం, బునఁ బాపపుఁ బ్రాణి లేదు ♦ మునికులతిలకా!
కనఁగ సకలాఘములకున్, వనితయె మూలం బరసిన ♦ వాఁడవు నీస్రుస్. 169

గీ॥ చేడియలు దమ్మువాంఛించి ♦ సేవఁ జేఁయు, వానిఁ గెలఁ [illegible] ♦ వానిఁగలసి
క్రీడసేయుదు రొడటు ♦ కిల్బిషముల, కించు కేనిఁయు [illegible] ♦ సీంద్ర! మదిని.

చ॥ నెఱపుననేని వంగడపుఁ ♦ బేరిమి గౌరవ మెందియేని బల్
సిరిఁగనియేని సాధుమది ♦ చేష్టడునంచనియేని మానినీ
తెఱవలు గాముకాత్మలయి ♦ తెంపున నెవ్వని నేని [illegible]
మరగి సుఖింతు రిందు నను ♦ మాన మొకించుక లేదు సంయమీ! 171

క॥ మగనియు బావల మఱఁదుల, బుగులునను బరిజనముల ♦ బుగులున మదికిం
దగుపురుషులు సేకూరమి, మగువలు మగనికడనుందు ♦ మరియూప మెయిన్.

క॥ వీరికిఁ జోరరాసిది యెం, దారయఁగా నొసర [illegible] ♦ [illegible] సను నేచెన్
మీఱుచిననుచుందు రేపున, జారునిఁజేరంగఁ దాప ♦ సకులవతంసా! 173

క॥ చూడరు సుందరరూపము, చూడరు శీలమును గులము ♦ చూడరు విద్యన్
జూడరు ధనంబునుస్ మగ, వాఁడేనియు ననుభవింత్రు ♦ భామలు మానీ! 174

గీ॥ అగ్ని దనియదు గట్టెల ♦ నర్ణవంబు, నదులదనియదు కాలుండు ♦ నుదనియుండు
భామలును బురుషుల్ ♦ పొలఁతులెపుడు, పురుషులన్ గూడి తనియరు ♦ మునివరేణ్యా!

క॥ ఎంతేనియుఁ గామమునుస్సన్, బంతంబున నంధకుబ్జ ♦ వామనతతులన్
సంతసగొని పరపురుషుల. నెంతయుఁ జేసుదురెఱుంగు ♦ మిద్ధతపస్వీ! 176

ఆ॥ మగనిమాటఁ ద్రోయుట్లు ♦ మగువలు ప్రీతిమైఁ, గుత్సితులగు పెఱులఁ ♦ గూడుచుందు
రిదియుదనిస ముప్పు ♦ డిగురుబోడులకడఁ, దెలియుమాత్మలోన ♦ దివ్యమౌని! 177

క॥ సిరులను భోగంబులనుస్, బరమాలంకారములను ♦ వాంఛింపరిలన్
సురసతులట్లు కోమలు, లగయుఁగ లోకంబులందు ♦ ననఘచరిత్రా! 178

గీ॥ జనులు మిథ్యాభాషణ ♦ సమ్మమును ని, సంబు సర్వము లసిధార ♦ చటులపవన
వహ్నులును బడబాముఖం ♦ బలులును నో, కట పొలంగెడువారు వి ♦ స్ఫుటముమౌని!

వ. ఇట్లుచెప్పి నమస్కరించినంత నారదుండు నిక్కంబాడితివని యక్కురంగనేత్రిను
బంపెనని యనిట్లు స్త్రీస్వభావంబును గుఱించి ముచ్చటించితినిఁక గాలచక్రమున
మనుజులకు మృత్యుచిహ్నంబులఁ జెప్పుదువినుండు.

## —* కా ల జ్ఞా న ము *—

క॥ దీనిస్ బార్వతి కనఁగా, దీనమతిన్ శౌర్య నడుగ ♦ దేవేశ్వరుఁ డ
మ్మానినికిట్లు తెలియఁగించెను, మానిసిందుకులు చెప్పుదు వినుఁడు ♦ మనములలరఁగాన్.

గీ॥ కర్ణ ముకుళించుక లేకయె ♦ గాత్రమెల్ల, తెల్లనైయమరిననేని ♦ వినుము మనుజుఁ
డారు నెలలకుఁబోవు ♦ సంశయమ్ముగ, కఁడగఁగలఁ డిది నిక్క ము ♦ హార్యతనయ!

క॥ ముఖమును కనులు పెనులు నా, లుకయును స్తంభదశ నొంద ♦ లోకేశ్వరిరో!
యొకఁ నారు నెలలలో సం, తకు గీమున సతిధ యగును ♦ దథ్యంబరయన్.

సీ॥ నేయి నూనె లద్దంబు ♦ నీరంబునందు ద, ర్పణమందు మోము గ ♦ న్పట్టకున్న
అల యరుంధతి సేఁక ♦ నాయుతధ్రువుని ధ్రువు, నాకసంబునఁ జూడ ♦ లేకయున్న
గ్రహంబులేక భా ♦ స్కరచంద్రులఁదమంబు, మింగెడుసట్లు గ ♦ నంగఁబడిన
కాకులతోఁ బతం ♦ గంబులతోడను, నూటిగాఁ దానొండు ♦ చుట్టఁబడిన

గీ॥ నాల్కవాపొంది యెంతయుఁ ♦ స్థైల్యమొంద, దంతపఙ్క్తియుఁ జాల క్లే ♦ దంబుఁజెంద
దిశలగుర్తింపలేక భ్రాం ♦ తినిగొనినను.మనుజుఁడారుమాసములలో ♦ మరణమొందు.

సీ॥ ఎడపక యొకనెల ♦ నెడమహస్తంబు కం, పంబును నొకలీరు ♦ నడపసేనేని
దవడలున్ గొంతు కెం♦తయును దడిన్ మాలి, మించువైఖరిని శో♦షించెనేని
తన నీడయందు మ♦స్తకము గన్పట్టక, దురుసున మొండెంబు ♦ దోఁచెనేని
కాకమేనియు విహం♦గంబేని యలకపో, తంబేనిఁ దలయెక్కి ♦ తనరెనేని

గీ॥ కారణములేక మాక్షిక ♦ గణమువచ్చుఁ, జేరి పరివేష్టనంబున ♦ విరాకనేని
అట్టిమనుజన్మఁడొకనెల ♦ యందె జముని, పోలికేగఁగలం డిందు ♦ బొంకులేదు.

గీ॥ పట్టపగటను నుల్కాభి ♦ పాతనంబు, నడికిరేయిని నింద్రధ ♦ నుంబుఁజూచె
నేని వాఁడాఱునెలలలో ♦ నినతనూజ, సన్నిధికిఁజేరు లేదింక ♦ సందియంబు.

వ. మఱియు నింకను ఛాయాపురుష స్వరూపంబుఁగూర్చి చెప్పెదను వినుము. 178

— * ఛాయాపురుష దర్శన ఫలభేదములు * —

క॥ ఇనునైనను శీతలర, శ్మినినైనను వెనుకఁజేసి ♦ సితపటధరుఁడై
మనమున దైవముఁ దలఁచుచుఁ, దనచాయను జూడవలయు ♦ ధరాధరరా!

వ. అందు శిరోవిహీనంబైన నాఱుమాసంబులలో మృతిఁజెందు. 189

గీ॥ ధవళమైనను నాచాయ ♦ ధర్మమొందుఁ, గృష్ణమైనను నాచాయ ♦ కల్మషంబు
శోణమైనను బందిలోఁ ♦ జొచ్చుఁ బీత, మైనఁ గలహంబువాటిలు ♦ నగసుపూరి !

చ॥ మఱి విభుజుండుగాఁ దనర ♦ మృతిందుడు రిష్టపుబంధువుల్ విభుగం
బొఱఁగిన క్షుద్భయంబు గటి ♦ యుక్ గనుపట్టక యుండెనేనియుక్
సుతుఁగును భార్య జంఘ లటు ♦ చొప్పడకున్న ధనంబు వోయెనుక్
జరణములుక్ గనన్ బడని ♦ చంపమునన్ బరదేశమేగుచున్. 191

క॥ అనుటయుఁ బార్వతి శర్వున, కనియెను మరణంబుఁ దెలియు ♦ నట్టివిధముఁ జె
ల్పినయట్టులె సాంప్రతమున, ననఘా! మృతిఁగల్చుజాడ ♦ నానతి యిమ్మా!

క॥ అనుడున్ శంకరుఁ డగజకు, ననె దేవీ! సర్వజనహి♦తార్థిని యా
ట్లనుపుగ నడిగితి వెంతయు, విను మింక నెఱిఁగింతు యోగ♦విద్యారహస్యన్.

వ. పృథివ్యప్తేజోవాయ్వాకాశంబులు పంచభూతంబు లేతత్స్వరూపంబుగాఁగఁబడె పాంచ
భౌతికంబగు శరీరంబు. అందాకాశంబు సర్వవ్యాపియై యుండు. సర్వం బాకాశ
మందు లయించు. 194

క॥ ఎద్దాని వియోగంబున, నొద్దిక భూతంబులెల్ల ♦ నొందెడు స్వపదం
బద్దాని సన్నిపాతము, నెద్దేవుఁడు స్థిరముగాఁగ ♦ నేర్పడఁజెప్పెన్. 195

వ. జ్ఞానులగువారు తపోమంత్రబలంబుల నిది యంతయు నెఱుంగుదురనినఁ బరదేవి
మహేశ్వరున కిట్లనియె.

గీ॥ దేవ! మును ఘోరరూపుఁ డా ♦ దివ్యమూర్తి
కడుఁ గరాలుండు కాలుండు ♦ గర్వమణఁగ
నీదు శూలహతిఁ జేసి ♦ నిహతుఁడై మ
రల భవదనుగ్రహంబున ♦ బ్రతుకుఁ గాంచె. 197

క॥ పొరిఁబొరి నిను సంస్తుతులన్, మఱిమఱి సంతోసపెట్టి ♦ మరలఁ దనదియా
నరనగు నధికారముఁగొని, పొరిగొనుచుండెను యథేచ్ఛ ♦ భూతవితతులన్.

వనమయూరము: అక్కటతన దేవర! ద♦యామతి యొసంగన్
దిక్కఱి మృతిన్ గొనెడు ♦ దీనులను నెంతేఁ
జక్కఁగని చెప్పు మిఁక ♦ సాయమగు మార్గం
బెక్కరణిఁ గాలుని జ♦యింతురొ మహాత్మా!

## —* మృత్యుంజయ యోగములు *—

వ. అనిన మహేశ్వరుండు.

గీ॥ ధ్యాసపరులైన యోగు లె♦ట్టాననేని, పంచతను జెంద రిద్ధి ధ్రు♦వంబు వారు
కాలునిన్ గెలుచుటకెందుఁ♦జాలువారు, రమ్యతరగాత్రి! పర్వత ♦ రాజపుత్రి!

వ. ఆయోగంబును జెప్పెద.

క॥ హిమకరవదనా! చెప్పెదు వినుము మేదురయోగవిధము♦నున్ సులువుగ భూ
తములైదు తద్గుణములును, నమరగ దేహంబు జనన♦మగు నిలలోనన్. 201

గీ॥ ఆకసంబున వాయువా ♦ యనిలమునను, నగ్ని యద్దాన నుదకంబు ♦ లాజలములఁ
బృథ్విజనియించు వినుము వి♦భీతహారిణి, నయనరో! విలోమగతిన లై♦లయముఁ జెందు.

క॥ ఇల నైదు గుణంబులతో, సలిలము నాలుగుగుణముల ♦ జ్వలనుడు మూటన్
జెలువుగ రెంట సమీరం, బలయంబర మొక గుణముస♦నలరెడు సాధ్వీ! 23 0

వ. శబ్దస్పర్శరూపరసగంధంబుల నెడు నీగుణంబులెపుడు భూతంబులఁ బాయునో నపు
డవ్వి విపన్నంబులగును. అందువలనఁ గాలజిగీషుండగు యోగిచే శబ్దాది గుణం
బులు స్వస్వకాలంబందుఁ జింతనీయంబులు.

క॥ దేవి! రహస్యముఁ జెప్పెద, నీవిఁక నిద్దాని భక్తి ♦ నిరతుఁడును గడున్
బావనుఁడు శ్రద్ధధానుం, డౌ వానికిఁ జెప్పు వలవ♦దన్యున కెపుడున్. 305

గీ॥ రాత్రులందున దీప వి♦రహితమైన, యంధకారమునన్ జను♦లందఱును ని
దురను జెందుచున్నప్పు♦డరసి సెజ్జ, యందుఁగూర్చుండి సుశ్వాస♦మమరుచుండ.

వ. యోగంబు సల్పవలయు నది యెఱింగింతు వినుము.

తుంకారమును బాగుగా నభ్యసింపవలయును. ఈ ప్రకారమభ్యసించినయెడల యోగి పాపంబులఁ జెందడు. యోగపరిపాకమొందిన మృత్యుజిత్తగును. ఈనవ విధముల ఫలితంబుఁ జెప్పెద నాలకింపుము.

సీ॥ ఘోషమొప్పుచునాత్మ ♦ కున్ శుద్ధిదము రోగ, హరము వశ్యాకర్ష ♦ కరమునగుచు
గాంస్యనాదము ప్రాణి ♦ గతుల నిరోధించు, భూతంబులను గ్రహం ♦ బులను నెట్టు
సతి! శృంగరవ మభి ♦ చారిశాత్రవజనో, చ్చాటనమారణ ♦ సాధకంబు
ఘంటానినాద మా ♦ కర్షణంబొనరించు, నైలింపసిద్ధ క ♦ న్యలకు నేని

గీ॥ ఇఁకను వీణాక్వణనము ద ♦ శ్వెందు నేని, బరఁగువానిఁ గనంజేయు ♦ వంశనినద
మఖిలతాత్త్విక సిద్ధిని ♦ నమరఁజేయు, దుందుభిధ్వానము జరామృ ♦ తులను బాపు.

క॥ విను శంఖనాదమున భు, వనములనెల్లను జరించు ♦ వలతియగుఘనా
ఘనగర్జనమున నాపద, లను బాయు మహోత్కృష్టమైన ♦ లలితాంగి! ధరణ. 220

వ. ఇఁకను.

ఆ॥ ఏకచిత్తమొంది ♦ యెంతయుబ్రహ్మరూ, పంబుగాఁదనర్చు ♦ భవ్యమైన
యనుపమంబునైన ♦ యల్లతుంకారంబు, విన నసాధ్యమొకఁడు ♦ వెలయఁ దెందు.

గీ॥ మఱి యతఁ డఖిలజ్ఞాత సర్వజ్ఞ ♦ నుండనుఁడును, సర్వదర్శియునై యిఁక ♦ సర్వలోక
సంచారములఁ సంచరించు వి ♦ కారనములను, బెంపఁ జొక్కింతయాతఁడు ♦ శివసముండు.

వ. పరమేశ్వరీ! యిట్లు శబ్దబ్రహ్మస్వరూపంబుతీ రెఱింగించితి నిఁకేమి వినవెంచెదవన సత్యేశ్వరి యిట్లనియె. దేవా! వాయుమార్గంబు ననుసరించి ప్రాణాయామంబొనర్చునట్టి కాలుని జయింపురందు రద్దాని నెఱుంగఁ జెప్పుమన్న శంకరుండి ట్లనియెను. 223

క॥ దేవి! చెప్పెద వినుమింక, పావనమగు యోగమద్ది ♦ ప్రాణాయామం
బేవాఁ డొకమూసార్థముఁ, దా విడువక చేయు మిత్తి ♦ దాఁటఁగలఁడిలన్. 224

వ. పవనధారణంబున జ్ఞానవిజ్ఞానంబులు నుత్సాహమును బ్రవర్తించును. 225

గీ॥ ఎవఁడు పవనంబును జయించి ♦ యొసఁగు నట్టి, వాఁడు సర్వజగజ్జయ ♦ భాగ్యమొందు
నిల జరామృత్యువులను జ ♦ యించుఁ బ్రాణ, ధారణధ్యానపరుఁడయి ♦ తనరవలయు.

గీ॥ లోహకారుఁడు భస్త్రిక ♦ లోన గాలి, నెల్లనిండించి తన పను ♦ లెసఁగఁ జేసి
కొను నట్టులె యోగియగువాఁడు ♦ కూర్మిమీఱ, పవనధారణమభ్యసిం ♦ పంగవలయు.

గీ॥ వ్యాహృతిపురస్సరముగగా ♦ యత్రిమనువు, రహిశిరసుతోడనాయత ♦ ప్రాణుఁడగుచు
మూఁడుమారులుదాజపం ♦ బునునొనర్ప, వఱదేకాత్ముఁడగుచుఁబు ♦ వ్వారుఁబోఁడి!

ఆ॥ వాయవీయతత్త్వ ♦ వరయోగ మీయది, పరమయోగిజనుల ♦ భాగ్యలక్ష్మి
గ్రహము లర్కశశులు♦గ్రచ్చ అమరలుదు, రెపుడు మరలఁడతివ! ♦యీసుయోగి.

క॥ నూతేండ్లు విమలతరకుశ, నీరముఁగోరులుచుఁ దపించు ♦ నేర్పరికిఁగడున్
జేరెడు సుకృతఫలంబది, చేరుఁబవనధారణంబుఁ ♦ జెందెడుకృతికిన్.

వ. వెండియు నెవఁడు మాంద్యముఁబాసి యేకాంతమందుఁ బ్రాణాయామం బొనర్చునో యవ్వాఁడు ముసలితనమును రోగంబును మిత్తిని గెల్చి వాయుగమనంబున ఖేచరత్వ మొందును మఱియు సిద్ధరూపంబుఁ జెంది కాంతిని మేధను బరాక్రమంబును శౌర్యంబును గాడ్పుతోఁదుల్యంబగు గమనంబును సుఖంబుగఁ బొందునికఁ బెక్కు లేల? యే బాపఁ డుదయమున లేచి ప్రాణాయామం బొనరించునో యవ్వాఁడు బ్రహ్మలోకంబును జెందు నిందు సందియంబు లేదిట్లు వాయుసిద్ధిని జెప్పితినికఁ దేజంబువల్ల నగుదానిన్ జెప్పెదువినుము. జనులెల్ల నిద్రించియున్నపుడు దీవియ లేని యంధకారంబందు సుఖాసనంబునఁ గూర్చుండి భ్రూమధ్యమందుఁ బ్రకాశించు వహ్నిజ్యోతినిఁ జూడవలయు నిది భూచరీముద్రాయోగము. మఱియుఁ జేతి వ్రేళ్ళతోఁ గన్నుల నించుకపీడించి సగము ముహూర్తమేక భావ్యుఁడై వెలుంగు జ్యోతినిఁ జూడఁదగుఁ దెల్లనై యెఱ్ఱనై నల్లనై చిత్రవర్ణమైయొప్పు నిది ఖేచరీముద్రాయోగము. 231

గీ॥ కనుబొమలమధ్యయం దలి♦కంబునందుఁ, బరఁగుబాలార్క తేజోవి♦భాసురమగు
జ్యోతిఁగనుచున్న పురుషుఁడు♦సురుచిరేష్ట, గాత్రమును జెందునికఁబర♦కాయ మొందు.

వ. మఱియు నణిమాదిసంపన్నుండై దూరదర్శన దూరశ్రవణజ్ఞానవంతుండై బహురూపధారణసామర్థ్యంబును ఖేచరతాసిద్ధిని బొందు నిక వేదాధ్యయన సంపన్నులును నానాశాస్త్రవిశారదులును నగువారు సంతతము పూర్వకర్మవశంబున మోహంబుఁ బాయలేరు, 233

గీ॥ కనుచుఁ గనలేరు వినుచును♦వినఁగలేరు, పాపమోహితులై యంధ♦బధిరులట్లు
తమమునకుదూలనున్న యు♦త్తపనవస్తు, నామహాపురుషునిఁ దెలి♦యంగఁజెల్లు.

ఆ॥ విను సహస్రశీర్షుఁ♦డును సహస్రాక్షుఁడు, నున్ సహస్రపదుఁడు♦నునయి యొప్పు
నల పురుషుఁడు విశ్వ♦మందు దశాంగుల, సీమనావరించి♦చెన్నుమీఱు. 235

వ॥ ఇఁక భూతములలో నాలవదగు నుదకభూతంబున నగు నమరత్వంబును జెప్పెదను వినుము. నియతమనస్కుండై యోగి సుఖాసనంబునఁ గూరుచుండి సమున్నత శరీరుండై కూర్పఁబడిన కరపుటములుగలవాఁడై చంచువునుబోలిన ముఖంబున మెలమెల్లగ గాడ్పుఁబీల్చుచుఁ దాలుమూలంబులనుండి జీవదాయకములై స్రవించు నుదకంబులఁ గోరులుచుండవలయు నవి శీతలంబు లమృతజలంబు లిట్లు వీని

నిత్యంబు గోరిలువాఁడు మిత్తినిఁజెందఁడాకలి దప్పుల గెల్చి మహాతేజస్కుఁడై దివ్యకాయుండగును మఱియును. 236

గీ॥ ఏనుఁగువంటిబలంబు హరీంద్రుమట్టి, వేగము సుపర్ణువంటిమేల్ ♦ వీక్షణంబు
గలిగి కృష్ణకచములొప్పి ♦ పొలుచుదేవ, గురునిభుండయి దివ్యవ♦త్సరశతంబు.

వ. ఇఁకను నొకవిధంబుఁజెప్పెదనువినుము రహస్యము. యోగియగువాఁడు నాలుకను దవడలనునంచి కొంచెముకాలముంచవలయు నట్లైనఁ గ్రమమున లంబికాయోగమును జెందును. అటుమీఁదఁ బ్రసరించు చల్లని జలంబును సుధనుబోలెఁ ద్రాఁగినయెడల నమరత్వమునుజెందును. ఇట్లు తపోవ్రత నియమయోగాపథములచే ధర్మవిదులును నయవినయయుతులగువారు మిత్తిని గెలువవలయు నిట్లు నీవడిగినవానిఁ దెల్పితినని శివుండుమతోఁ జెప్పెనని సూతుండు మునుల కెఱింగించిన నవ్వారు మహాత్మా! మన్వంతరంబులను దద్వంశంబుల నెఱింగింపు మనుటయు సూతుం డిట్లనియె. 238

## ప్రతిసర్గము - మన్వంతరంబులు - వంశములు - తదనుచరితములు

క॥ ధ్రువుని సమున్నతపదవీ, నివేశితు నెఱుంగఁ జెప్ప ♦ నే? మును మీకున్
సువిహితుఁడాతఁడు పెక్కేం, డ్లవనిన్ బాలించె విబుధు ♦ లందఱు మెచ్చన్.

క॥ ఆ విభునకు సుతు లిద్దఱు, పావనులగు పుష్టి ధాన్య ♦ భాసురనాముల్
(శ్రీ) పెలయఁగఁ బుష్టికి సుతు, లావిర్భావంబుఁజెంది ♦ రైదుగురు తగన్. 240

వ. రిపుండును రిపుంజయుండును విప్రుఁడు వృకలుఁడు వృషతేజుండు నను వారు. 241

క॥ సుగుణికుమారసం దుత్త్తముఁ, డుదుగుణనిధియైన నాతఁ ♦ డొక గుహ్యకుచే
దురమునఁ జంపంబడె నా, పరితాపంబున జననియుఁ ♦ బంచతనొందెన్. 242

వ. ధ్రువపౌత్రు లైదుగురలో జ్యేష్ఠుఁడగు రిపునకుఁ బుష్కరిణియందు సర్వతేజుండను సుతుండు పొడమె నవ్వానికిఁ జాక్షుష మనువు జన్మించె ఆ మనువునకు నడ్వలయందుఁ బురువు, మానసము, శతద్యుమ్నుఁడు, తపస్వి, సత్యజిత్తు, కవి, అగ్నిష్టోమాతిరాత్రులు, అతిమన్యువు, సుయశుఁడు నను వారు పదిమంది కొమరులు జన్మించిరి. అందుఁ బురువున కాగ్నేయియం దాఱుగురు కొమరు లంగుఁడు, సుమనుఁడు, ఖ్యాతి, క్రతు వాంగీరసుఁడు, గయుఁడు నను వారు జన్మించి రందు నంగునకు సునీథ యను ధర్మపత్నియందు దుష్టచేష్టుండగు వేనుండు పొడమె.

క॥ తనయుని చెడునడతలకున్, మనమునఁ గడు రోసి యంగ♦మనుజవిభుఁడు గా
ననుబడి యెందుననేనియుఁ, జనియెను జిత్తం బొకింత ♦ శాంతిన్ జెందన్. 244

వ. అనంతరము.

గీ॥ రాజుగాఁ దనరిన వేనుఁడు పోజఁ దప్పి, చెడ్డచేతలఁ బ్రజల హింసించుచుండ
దివ్యమును లందఱును జేరి తేఁకువెసఁగ, నుగ్రులై చంపి రవ్వాని హుంకరించి.

వ. అటుమీఁద మునీశ్వరప్రార్థనచేతను నరాజకంబగు లోకంబుఁ గాంచియును దద్దుః ఖంబుఁ బాపఁగోరి దివ్యమును లవ్వేనునికుడిభుజంబును మథింప నందు ధన్వియుం గవచియు సూర్యతేజస్వియు నారాయణావతారంబగు పృథుఁడు జనించె. 246

క॥ ఆతఁడు గడుధార్మికుఁడై, భూతలమును నేలెఁగడిమి పొలుపొప్పఁగఁ బ్ర ఖ్యాతీతంబగు తేజము, ఖ్యాతియునుం గ్రమ్మికొనఁగఁ గరమునురక్షిన్. 247

వ. మఱియు.

గీ॥ రాజసూయాహ్వయమహాధ్వరం బొనర్చి, నట్టి యజ్ఞులలో నీతఁ డగ్రగణ్యుఁ డశ్వమేధశతంబుల నమరఁజేసె, నర్చియను భార్యతోఁ గూడి సౌఖ్యమంది.

వ. అమ్మహీనాథున కర్చి యందు విజితాశ్వుఁడు, హర్యశ్వుఁడను వారలిద్దఱుపుత్రు లుద్భవించిరి. ఆవిజితాశ్వునకు శిఖండిని యందుఁ బ్రాచీనబర్హి యను వాఁడుపుట్టె. ఆతండు సముద్రరాజసుతయగు శతధృతియనుకన్యను బెండ్లియాడె. ఆపెకు బహు యజ్ఞకరుండగు ప్రాచీనబర్హి నలనఁ బదిమందిసుతులు జన్మించిరి. ప్రాచేతసులనఁ బడు నవ్వారు పితృాజ్ఞచే సాముద్రోదకంబందుండి రుద్రగీతంబు జపించుచు శివ ధ్యానపరాయణులై పదివేలేండ్లు తపించిరంతఁ బ్రాచీనబర్హి యజ్ఞమునం దుపసంహర త్స్యమాణయగు పృథివియందుఁ బ్రజాక్షయంబయ్యె నది కాంచి యుగ్రతపమున్ను దపఃఫలంబుఁ జెందియున్న ప్రాచేతసులు నిజరాజధానిఁ జేరుచుఁ బుడమియందలి వృక్షంబులెల్లఁ బెచ్చుపెరిఁగి మార్గంబులను నిరోధించి ప్రబలియుండుటఁగాంచి యవ్వాని దహింపఁబూని ముఖమునుండి యగ్నిమారుతంబుల విడిచి సహస్రసంబులఁ గాల్చుచున్నఁ జూచి కొంతవడికి సోముఁడు వారిని దారసించి యిట్లనియె. 249

ఉ॥ కాల్పకుఁడింక భూజములఁ గానన మీరాయటి దగ్ధమయ్యె నిం దల్పతరంబులౌ ద్రుమము లాయెడ నీయెడ నున్నవిట్టి లీ స్వల్పములైనవాని నిఁక సేఁకఁడలంపుఁడు మన్యువేగముల్ మల్పుఁడు వేగ మామకకు మారిక యిందు వసించుఁ గాంచుఁడీ! 250

క॥ ఆకన్నియ వర్చస్విని, మీకదియగు ధర్మపత్ని మీరిఁక దానిం జేకొని వివాహమొందుఁడు, లోకగ నాదతఁడాయుష్టు సుతులఁగని పొలుచున్.

క॥ పదిమంది కెట్టు లాలగు, నిది యొకతుక యని మనమున నెంచంబోకుం డిది దైవచోదితంబై, యొదవిన దన వారలట్లు లొడఁబడి చేర్మిన్. 252

ఆ॥ వృక్షజాతయైన వెలఁదిని వార్షినిఁ, బెండ్లియాడిరంతఁ జేర్మిదనర వారి కాపెయందుఁ బ్రభవించె దక్షుండు, చాక్షుషాఖ్యమనువు సమయమందు.

వ. అతండు ప్రజాసర్గరతుండై మానసికసృష్టిన్ గూర్పి నయ్యది వృద్ధిగామిన్ జేసి బ్రహ్మచోదితుండై మిథునవిధువన ధర్మంబునఁ బ్రజావృద్ధిఁ బొనరింప నెంచి పరమేష్ఠితనూజుఁడగు నసిక్ని యనుదానిన్ బెండ్లాడియున్నంత నాపెయందు. 254

క॥ ఆ దక్షుని కఱువదిమంది, పైదలులు జనించి రధిక ♦ భాసురచరితల్
సౌదామనీప్రకాశలు, మేదురతరశేముషీక ♦ మోహితలు గడున్.

ఉ॥ వారలలోన ధర్మునకుఁ ♦ బద్గురఁ జంద్రున కిర్వదేడ్గురన్
ధీరుఁడు కశ్యపాఖ్యుఁడగు ♦ ధీమణికిన్ బదుమూఁగు రంగిర
స్సూరికిఁ గృశాశ్వునకు ♦ సొంపుగ భూతున కిద్ద ఱిద్దఱిన్
గోరి యరిష్టనేమికిని ♦ గూఁతుల నల్వుర నిచ్చెఁ బ్రీతిమై. 256

వ. ధర్మునిభార్యలగు పదుగురు – భానువు, లంబి, కకుప్పు, జామి, విశ్వ, సాధ్య, మరుత్వతి, వసువు, ముహూర్త, సంకల్ప యను వార లందు భానువునందు సుతుండై ఋషభుండను పేరిమిన వ్వాని కింద్రసేనుండు జన్మించె లంబియందు విద్యోతుండును ఘోషంబు లుద్భవిల్లె. కకుప్పునందు సంకటుఁడు పుట్టెను వ్వానికిఁ గీకటుండు జనింప వానికి దుర్గాభిమానులగు దేవతలు జన్మించిరి. జామికి దుర్గాధిష్ఠానదేవతలు జన్మించిరి. వారికి స్వర్గుఁడు నందియునుం బుట్టిరి. విశ్వయందు విశ్వేదేవులు పొడమిరి. సాధ్యయందు సాధ్యులు జన్మించిరి. మరుత్వతియందు మరుత్వంతుఁడు (ఇంద్రుఁడు) జయంతుఁడనువా రుద్భవించిరి. జయంతుండు విష్ణువగు నుపేంద్రుండు. ఇక వసువునం దయుఁడు ధ్రువుఁడు సోముఁడు ధరుఁ డనిలుఁ డనలుఁడు ప్రత్యూషుఁడు ప్రభాసుఁడు నను వారష్టవసువు లుత్పన్నులైరి. అందయునకు వైతండుండు శాంతుఁడు మునియనువారు కొమరులై పుట్టిరి. ధ్రువుండనువానికి కాలుండును సోమునకు వర్చుండును నవ్వానికి వర్చస్వియు ధరునకు ద్రవిణుండను వాఁడును, అనిలునకుఁ బురోజవుం డవిజ్ఞాతగతియు ననువారును నగ్నికి శరస్తంబమందుఁ గుమారుండు జన్మించుడు నాతని శాఖలందు శాఖుండు విశాఖుండును బృష్ఠమందు నైగమేయుండును జన్మించిరి. ప్రత్యూషునకు ఋషియను దేవలుండు నవ్వానికి క్షములు సుతులు మనీషులు ప్రజ్ఞాసంతతులు పొడమిరి. ప్రభాసునకు విశ్వకర్మ జనియించె. ఆ విశ్వకర్మకు మనువు జన్మించె. ముహూర్తయందు మౌహూర్తికులను దేవగణంబులును సంకల్పజుఁడగు కాముఁడును బొడమిరిఁక భూతునకును రూపయను నాపె యందు రైవతాజభవభీమవామోగ్రవృషాకప్యజైకపాదహిర్బుధ్న్యబహురూపమహాత్ములను నేకాదశరుద్రులును రుద్రపారిషదులగు భూతగణంబులు నుత్పన్నంబులయ్యె నింకఁ గశ్యపున కదితి దితి సురస అరిష్ట యిల దను సురభి వినత చేల తామ్ర క్రోధవశ కద్రువు ముని యను పొలఁతులు పదుమువ్వురు భార్యలైరి వారియం దదితికి వైవస్వత మన్వంతరంబునం దింద్రోపేంద్రులును

మఱియు నర్యముండు ధాత విధాత, త్వష్ట పూష వివస్వంతుండు సవిత మిత్రావరుణులు, అంశుండు, భగుండ నతితేజుండు ననుపన్నిద్దఱు సగాదిత్యులు జన్మించిరి.

ఆ॥ దితికిం బొడమిరిం కను ♦ సుతులు హిరణ్యాక్ష, శిపు హిరణ్యాక్షుండను సుతులు పొలుపుగను సింహిక యను సుతయును ♦ జెలువొప్ప నాహిరణ్యకశిపునకు సుతులు గలిగిరి కలను.

వ. అనుహ్లాద సంహ్లాద హ్లాద ప్రహ్లాదుల నలువురం బుత్రులను గాంచె వారియందుం బులోముండు మహిషుండును, ప్రహ్లాదునకు ఘనునిం బుత్రులును సంహ్లాదునకుం గృతియందు బంచజనుండును, ప్రహ్లాదునకు విరోచనుండును జన్మించి రా విరోచనునకు బలియును నాతని కశన యను భార్యయందుం బుత్రశతంబు జన్మించె నందు జ్యేష్ఠుండగు బాణుండు శివభక్తాగ్రగణ్యుండై శివుని మెప్పించి తద్గాణాపత్య మొందె నిం కను. 259

గీ॥ ఆ హిరణ్యాక్షునకుం బుత్రు ♦ లై దుగురగు, గుహ శకుని భూతసంతాప ♦ నులును గాల నాభుండును బిరుదగు మహా ♦ నాభుండను నను, వారలెంతయు విక్రాంత ♦ భూరిబలులు.

వ. సింహికను విప్రచిత్తి యనువాండు పరిగ్రహించె నిం క దనువను నామె కేశవాముఖుండు శంబరుండు కపోలుండు, వామనుండు, వైశ్వానరుండు, పులోముండు, విద్రావణుండు మహాశిరుండు, స్వర్భానుండు వృషపర్వుండు విప్రచిత్తి యను మున్నగువా రనేకు లుద్భవించిరందు స్వర్భానునకుం బ్రభయును కన్యకయును పులోమునకు శచియును వృషపర్వునకు నుదారవిహాయశిరశ్శర్మిష్ఠలును వైశ్వానరునకుం బులోమ కాలకలును బొడమిరి. 261

సీ॥ ప్రభయనునామె చే ♦ పట్టె నానముచిని, శచియను జేపట్టె ♦ శక్రుం బ్రీతి నలయుపదారవి ♦ యనుహిరణ్యాక్షుని, బెండ్లను నాయుపశిర ♦ నేగం గ్రతువు శర్మిష్ఠయు యయాతి ♦ జననాథు వరియించె, నిం క బులోమయను గా ♦ లక నుగేటిం బెండ్లాడి రరునది ♦ వేలపుత్రులు వార, లగ నుద్భవించిరి ♦ ప్రకటబలులు

గీ॥ ఘనులు పౌలోములనువారు ♦ కాలకేయు, లనెడువారగు సవస్యులు ♦ సచ్చరితులు లా హిరణ్య పురంబున ♦ నధివసించి, యుండిరవ్వారు ప్రతిసీమ ♦ నొందలేక.

వ. సింహికయందు విప్రచిత్తికి రాహుప్రముఖులగువారు పదుమువ్వురు కుమారులు జన్మించిరిం కను దామ్రియను కశ్యపపత్నికి. 263

క॥ కాకియు శ్యేనియు భాసియు, లూకియు గృధ్రియును శుకి యులుగశ్వియునున్ జోకగు సుగ్రీవియునున్, వీకన్ జనియించి మిగుల ♦ నెలసిరి పుడమిన్. 264

వ. ఇంకం గాకికిం గాకులును శ్యేనికి డేగలును భాసికి బోతులును నులూకికి గుడ్లగూబలును గృధ్రికి గద్దలును శుకికిం జిలుకలును అశ్వికి లొట్టిపిట్టలును గుఱ్ఱములు గాడిదలును సుగ్రీవికి శుభపక్షులును జన్మించె. మఱియు నిం కం గశ్యపపత్నులందు

